# ఇందుశేఖరవిలాసము

విద్వాన్,

వాసా కృష్ణమూర్తి, బి. ఏ., బి. ఇడి

మ్యునిసిపల్ హైస్కూలు, :: :: శ్రీకాకుళం.

# ఇందుశేఖరవిలాసము




విద్వాన్.

వాసా కృష్ణమూర్తి. బి. ఏ., బి. ఇడి.

మ్యునిసిపల్ హైస్కూలు, శ్రీకాకుళం.



శ్రీనివాస్ పబ్లిషింగ్ హౌస్,

రాజమండ్రి.

1953

రు 1—0—0





# మనోహరునకర్పితము

మ. జయ హాలాహలనీలకంధర : మహేశా ! భక్తచింతామణీ !
జయ గంగాధర ! చంద్రశేఖర ! జగత్స్వామీ ! కృపాంభోనిధీ !
జయ నీహారధరాధరేంద్ర తనయా చారుస్తన ద్వంద్వ సం
శ్రయ సంలగ్నపటీరకుంకుమరజస్సంపన్నబాహాంతరా !

మ. జయ సర్వేశ్వర ! సర్వలోక జనకా ! చంద్రార్ధచూడామణీ !
జయ కామాంతక ! కామితార్థఫలదా ! చక్షుశ్శ్రవఃకుండలా !
జయ సంపూర్ణకృపాగుణైకవసతీ ! శైలేంద్రజా వల్లభా !
జయ దక్షాధ్వరమర్దనా ! జయ గిరీశా ! యీశ ! రక్షింపవే.

క. నీయందు జగము లుండుం
బాయక యీజగములందుఁ బాయక నీ వుం
దీయనువు దెలియ నజునకుఁ
దోయజనేత్రునకునైనఁ దోపదు శర్వా !

శ్రీనాథ



# పీఠిక.

చంద్రికళావతంసుని పరమపావన చరితమును శ్రీనాథ కవిసార్వభౌముఁడు 'హరవిలాస' మను పేరిట పద్యకావ్యముగా రచించెను. ఇయ్యది నైషధము, కాశీఖండము మున్నగువాని పిదప వెల్వడిన గ్రంథరాజము. ఇందు భక్తి, శృంగార, వీర ములు ప్రధానరసములు. ఇది పూర్తిగ ననుకరణముగాక కొన్నినూతనకల్పనలతో నొప్పుచు రసవంతమును, మనోజ్ఞ మునై చదువరి నెంతయు నానందపఱచుచున్నది.

ఈప్రబంధమును బలుసార్లు చదివి యంతం దృప్తినొందఁ జాలక యథాశక్తి వచనకావ్యముగా నొనర్పఁబూని యాపని సాంతము గావించితిని. వచనరచనలోఁ గవిశేఖరుని పదములను, సమాసాదులను, విశేషప్రయోగములను సేకరించుట సరస మని భావించితిని. కథాభాగమునందు 'దక్షాధ్వర' మనుశీర్షిక గల ఘట్టమును మూలములో లేనిది యథాసందర్భముగా నీవచన రచనయందుఁ గూర్చితిని. అచ్చటచ్చట గ్రంథవిస్తరభీతిచేతను, జదువరికి విసువు జనింపకుండుటకును దీర్ఘవర్ణనలను యథోచిత ముగా సంగ్రహించితిని.

నూతన కల్పనలతోను, కవితా చాతుర్యముతోను నొప్పారుచున్న యీకావ్యమును వచనరూపమున వెలయించి యాంధ్రపాఠకలోకమునకు ప్రాచీనసుప్రసిద్ధ కవికృతమహా కావ్యములం దభిరుచి కలిగించుటయే నా ప్రధానాశయము. ఈయాశయము ఎంతసమంజసమో దీనికి ఆదరప్రచారము లెంతవఱకు కల్పింపవలయునో నిర్ణయించుభారము ఆంధ్రపండిత బృందాయత్తము. ఈయాశయసిద్ధి విజ్ఞానతృష్ణగల ఆంధ్ర విద్యార్థిబృందమున కధీనమై యున్నది.

శ్రీకాకుళం
1-6-1953

సుజనవిధేయుఁడు,
వాసా కృష్ణమూర్తి.



# విషయసూచిక.

ఓమ్

# ఇందుశేఖరవిలాసము.

## 1. తుంబురునిశాపము.

సకల శ్రేయోనిధానం బగు బదరికాశ్రమంబున దుర్వాసుం డను మహామునివరేణ్యుండు శిష్యులతోఁ దపము సేయుచుఁ గడుశాంతభావంబునఁ బ్రవర్తింపుచుండెను. అంతట నొక్కనాఁ డమ్మునీంద్రుండు మధ్యాహ్నకాలంబునఁ గృత స్నానుండై పితృతర్పణాదులఁ గావించి, వైశ్వదేవబలిహరణం బులఁ దీర్చి, పర్ణశాలవాకిట నీవారపాయసాన్నం బల్లనల్లన లేడిపిల్లలకు మేపుచుండెను. ఆసమయంబున నంబరమార్గంబునఁ దుంబురుం డను ప్రమథుండును, సతివి నితంబిసియు విమానం బెక్కి గోకర్ణవాసి యగు దృక్కర్ణభూషణు సేవింపఁ బోవు చుండిరి.

అంత నయ్యాశ్రమంబు నడుచక్కినుండి యమ్మునీంద్రుండు హరిణవత్సంబులకుం జేయు వాత్సల్యంబునకు నద్భుతంపడి తుంబు రుండంగుళిస్ఫోటనం బొనర్చెను. అచ్చిట్టమిడికి నాలేడి

పిల్లలు బిట్టుబెదరి పఱచిన 'నిదియేమి చప్పుడో' యని దుర్వాసుండు గగనమార్గంబునం దృష్టిపఱచెను.

తుంబురుని గాంచినంతనే దుర్వాసుండు హుంకరించి, "ఓరీదురాచార! నాజింకలు మేయుచుండఁ జేచిట్టి ద్రోహించి, వానిభుక్తి కాటంకంబు గల్గించితివి. దీని నే నెట్లు సైరింతును. కావున, నీ వింక మర్త్యుండ వై భూలోకంబున జనించు" మని తుంబురుని శపించెను.

శాపభీతిచేఁ దుంబురుండు విమానము డిగ్గి, భక్తి నమ్రుండై, సాష్టాంగదండప్రణామం బాచరించి "మహాత్మా! కరుణింపుము. మీ రతికృపతోడ హరిణవత్సంబులకుఁ బాయసాన్నంబులు గుడిపింప సంతసంబునఁ జిట్టమిడితి; కాని వాని కగ్గుసేయు తలం పావంతయు లేదు. ఇది నా కెంత చెట్టయయ్యె? నీవచనం బమోఘంబు. నేనును బురాకృతఫలం బనుభవింపక పోవచ్చునే? కావున, నాకు మర్త్యత్వం బవశ్యభోగ్యంబు గావింపుము. నాయపరాధం బల్పంబ; దీనికిం దగ శివభక్త గృహంబున జన్మించునట్లుగా ననుగ్రహించి, శాపాంతంబు కృపసేయుము. నీకృపావిశేషంబునం గ్రమ్మరం బారిషపదవి కలుగునం దాక మద్భార్య నీకొంగోడలు, నీపాదచర్య సేయుచు నీయాశ్రమంబున నుండగలయది." యని దీనాననుం డగుచుఁ బాదంబుల మీదఁబడెను.

దుర్వాసుండును సదాక్షిణ్యంబుగ "నీముద్దియ నాదు కోడలు; ఇట నెమ్మి నుండనిమ్ము. నీవును నిద్దుర మేలుకొన్న గతి క్రమ్మరి రమ్ము. ఇక పొమ్మ"ని యానతిచ్చెను.

తుంబురుండు తత్క్షణంబ జంబూద్వీపంబునం గాంచీనగరంబునం జిఱుతొండం డనుపేర వణిగ్వంశంబున నుద్భవించెను. చిఱుతొండండు షట్కాలములందుం గఱకంఠుండును, దరణేందుశేఖరుండును నగునీశ్వరునిం బూజించుచు భక్తు లెవ్వరేదివేడిన వారియభీష్టములం దీర్చుచు నేకొఱతయు లేక సుఖంబుండెను.

తుంబురుని భార్యయగు నప్సరోంగన నిజాంశంబునం గాంచీనగరంబునందు వణిగ్వంశంబున నవతరించి, చిఱుతొండ నంబికి భార్యయై సిరియాలుం డనుకుమారునిం గనియె. ఆపుణ్యదంపతు లిరువురు షట్కాల లింగార్చనంబులను, సంతతజంగమారాధనంబులను గాలంబు గడుపుచుండిరి. కంచిలో నేడు వాడలు నత్యంతము కలసిమెలసి, పాడియుం బంటయుం గలిగి జనులందఱు నుల్లసిల్లగ నిత్యకల్యాణము. పచ్చతోరణమునై కంచి యొప్పుచుండెను. చిఱుతొండండును బూర్వజన్మవాసనావిశేషంబునం దుషారగిరికన్యకాకరకమలకిణాంకితుం డగుటం జేసి వలయాంకుం డనం బ్రసిద్ధివహించి, యేకామ్రనాథు నారా

ధించుచుండెను. శుద్ధవీరశైవాచారపరాయణుండగుచు, జంగమప్రియభక్తులకుఁ దనమనోవచనంబులేక యేవేళ సేవదార్థంబు వేడిన లేదన కిచ్చుట వ్రతంబుగాఁ బట్టి, పట్టినవ్రతం బెల్ల సాంతం బొనర్చుచుండెను.

# 2. భక్తి పరీక్ష — ౧

చిఱుతొండనంబియు, నతనిభార్యయు వీరశైవవ్రతంబు
సాంతం బొనర్చుచుండ నొక్కనాఁడు ప్రముఖుం డొక్కరుండు
సావధానమానసుండైన యాజగ జెట్టి సెట్టియింటి కేతెంచి,
'శివపుష్కారణ్యం'బని దీవించె. అంత, సెట్టియుఁ, బాదార్చ
నాద్యుపచారంబుల నాతనిఁ దృప్తునిం గావించి; సుఖాసీనుం
జేసినంత నాతం డిట్లనియె "మాకు నిత్యము హరునకు నిక్షు
రసంబు నభిషేకం బొనర్చు వ్రతంబు గలదు. కావున, మాకుఁ
దూమెఁ డిక్షురసంబు దెచ్చియిమ్ము. చేగానుగాడిన చెఱకు
రసంబుతోఁ బురారి నభిషిక్తుఁ జేయుమని నాగురువు నాకుప
దేశించెను. కావున, ని న్నీపని గోరుచున్నవాఁడ" నంచుఁ
గక్షంబునం ధరియించిన యాసొఱపుంగాయలోని భస్మం
బిచ్చెను

వైశ్యబృందారకుండు దానినందికొని, యిందుధరుండు
మనమందిరంబునకు వచ్చినాఁడు; గరగరగా వంటకమ్ములు
గావలయునని తిరువేంగనాంచి కప్పగించెను. అంతఁ బంపాతరం
గిణీ తీరోద్యానంబునం జెఱకుం గోలలం గైకొనెను. ద్రావిడో
త్తముం డొక్కఁడై కడు వెగ్గలమైన మోపుగట్టి, యెత్తఁ
బోయి ముందునకు మ్రొగ్గతిలం బడెను. అంత భక్తవత్సలుం
డగు శంకరుండు వడిం జెమర్చుచు నచ్చోటి కేతెంచెను. వచ్చి,
శ్రీమహాదేవుండు చెఱకుమోపు వైచి, తక్షణంబ మాయ

మయ్యెను. దీనిం గాంచి, వణిగ్వరుం డచ్చెరువందుచు, జేయం త్రమునఁ జెఱకురస గాఁడెను. తోడనే పాటితూమున రసము గొలిచి జంగమునకుఁ జిఱుతొండఁ డిచ్చె; నాతండును జం ద్రార్థమౌళి కారసముతో నభిషేకం బొనర్చెను.

ఇచ్చట వైశ్యోత్తముఁ గూడి, ఘండేత్క్షుపత్రితానంబు దెచ్చుచుండ వెండికొండపయి నస్తోకాప్సరోభామినీ నటనా లోకనవేళ మందాకినీమౌళికి స్వెమ్మ సెమర్చెను. దీనిం గాంచి, హిమగిరిరాజనందన యీర్ష్యోద్ధతులు ఘటిల్ల "ప్రేంకణము లాడెడు వేళ వేలుపులేమలఁ గాంచి చెమరిచె" నంచు మహేశ్వ రుని గేళి సరసీరుహ మెత్తి మొత్తెను. అంత శశాంకశేఖరుని మూఁడుకన్నులఁ బరాగములు చిందెను.

లీలారవిందంబున హిమశైలనందనచేత వేత్రుటువడి; యిందుధరుండు సురసుందరీసందర్శనంబుననైన కందర్పవికా రంబు గాంచి తేటపడ, మందస్మితవదనారవిందుండై యిట్లాన తిచ్చె "ఓకమలాక్షీ! ఇదియేమని తలంచితివి? ఇది నీ యర్ధదేహము కాదే? నీహృదయము పొరువుననే నాహృదయ ముండుటలేదే? ఇట్లేకీభావము నొందియుండ నేభావమునైన దాఁప నా కెట్లను వగును? నానేరమి యేమియు లేకుండ నెత్తమ్మి మొగ్గను నావక్ష స్థలమునఁ గొట్టి నన్ను గాయపఱచితివి. పుష్పరజము, పుష్పా సవము నాకన్నులం బడె. చూడు మిదె నాకన్నులు నీరెటులు గ్రమ్మినవో! నామెయి సెమర్చుటకుఁ గారణంబు జెప్పెద నాకర్ణింపుము."

"కాంచీనగరంబునందు శివభక్త్యాచార సామ్రాజ్యలక్ష్మికిం గంఠాభరణంబునా నొప్పువాఁడును, నిర్మలవణిక్ఛ్రేష్ఠాన్వయాంబోధికి నాకానిశాకరుండును, నుత్తమశ్లోకుండును నగు చిఱుతొండశ్రేష్ఠి సదా శివధ్యానతత్పరుఁడై పూజావిధుల నత్యంత నీమంబుతో నొనర్చుచుండును. జంగమప్రముఖు లెందఱే వేళల వచ్చి యేపదార్థ మెంతకోరిన నర్థిమెయి వారల నెల్లఁ గృతార్థులం జేయుచుఁ దన కెవ్వరీడన నొప్పుచుండును.

ఇట్లుండ శివభక్తినిరతుండును, నిర్మలాత్ముండును, సూర్యాద్భవవంశసంభవుండును నగు చిఱుతొండని జంగమంబొక్కరుండు భిక్షావృత్తి జేరంజని, మా శివుని బూజించెద; తామె డిక్షురసంబు దేవయ్యా!" యని ప్రార్థించెను.

శైవాచారసంపన్నుండగు నాసెట్టి యట్లే కానిమ్మ్"ని తోటకుఁ బోయి, మంచి నల్లచెఱకులు తామేఁడు రసమునకుం దగునట్లు విఱచి, కడుభారంబగు మోపుగఁగట్టి, యామోపును గదల్ప నశక్తుండయి యుండెను. "నేను నాభక్తులను వలతును; నాభక్తులు నన్ను వలతురు. నే నంతట నచటికిఁబోయి యొకవంక పట్టి మోపును భుజమున కెత్తికొంటిని. శ్రేష్ఠియు మోపు నొకవంక పట్టి భారమునఁ జెమర్చెను. అంత నేనును జెమర్చితిని. నాభక్తుల కిట్టిచనవు నేనొసఁగెదను. ఇంతమాత్రమునకే యీ చెమర్చుట నన్యంబుగాఁ దలంప నీకుఁ బాడియగునా?" యని శశాంకధరుం డీవృత్తాంతంబును వివరించెను.

పార్వతీదేవి యచ్చెరువంది "దేవా! అతనిని జూడ నా మనంబు దత్తరిల్లుచున్నయది. నన్ను గంచికిఁ దోడ్కొనిపోయి యాశివభక్తునిఁ గనులారఁ గాంచుభాగ్యమును నాకుఁ బ్రసాదింపు"మని సర్వజ్ఞుని బ్రార్థించెను. తోడనే పంచవదనుండు సమీపంబునం గాంచియున్న పాకశాసనుని వీక్షింప నాతఁడు ముకుళితహస్తుఁడై "దేవా! యానతిమ్ము. నీయాన నొదలఁ దాల్ప నుద్యుక్తుండను. భృత్యునకు స్వామియాజ్ఞకన్న భాగ్యంబు గలదే? కావునఁ దక్షణంబ యానతి"మ్మని పాకశాసనుఁడు పలుక "పాకశాసనా! కాంచీపట్టణమునందు నలుదిక్కుల మూఁడుయోజనంబులమేర మున్నేడు వాసరంబులకాలవర్షంబు గలుగునట్లు మేఘములఁబంపుము. మా కొక రహస్య కార్యంబు గలదు. తత్కార్యసిద్ధికై రేవగళ్ళు కుంభద్రోణములుగ వర్షించవలె"నని యిందుధరుం డానతిచ్చెను.

తక్షణంబ పాకశాసనుం డైరావణము నెక్కి రెప్పపాటంతలో నమరావతికిం బోయి, పుష్కలావర్తకాది కాంభోధరంబుల సంకెళ్ళు విడిపించి, పదివదునొకండు దినంబులు వర్షింప నియమించెను. అంతఁ బశ్చిమంబున నింద్రధనుస్సు వొడిచెను; పరివేషమండలంబు నిండుచందురుని బరివేష్టించి యుండెను. వీనిని గాంచి 'త్రీవాన యవశ్యము బహువాసరంబులు బడివట్టు' నంచుఁ గంచిలోపలఁ బౌరులు సంభ్రమింపఁ దొడంగిరి. గ్రహసిద్ధాంతకళావిదులు 'పెక్కుబాధ లొదవు' నంచుఁ దమలో

భాషింపుచుండ, నావలుకులు గృహస్థులు విని, యింధనతృణ క్లేశంబుం జింతించుచుఁ గడుభయం బందిరి.

అంతఁ దటిదభిఘాతవేగమున వర్షధారలు జారుచుండఁ జతుర్దిశాతటంబుల పిడుగులు పిటిలు పిటిల్లనం బ్రిదిలి ప్రేలుచుండెను. చెవులు చిల్లులువోవ నాగర్జనంబుల విని, కాంచిపురీజనంబులు తమహృత్పుటంబుల నిందప్రసూనుని నామదశకంబును జపింపఁ దొడంగిరి. వర్షజలంబులు నగరితోఁగూడ నేకామ్రనాథుని ముంచివైచెను. ఈయకాలవర్షము కాంచీనగరమునంతను దెప్పలఁ దేల్చెను.

ఇవ్విధంబున నిరువదియొక్కవాసరంబు లెడతెఱపి లేక పాము వ్రేలంగట్టిన భంగి, నింగి యవిసి కాఱిన చందంబున, సముద్రంబు వెల్లివిరిసినలీలను, బిలంబు తెరచిన వడువునను సంతతధారావృష్టిఁ గురిసి, మిఱ్ఱుపల్లంబుల సరిజేయుచు, నిరువదిరెండవదినమున జడివాన యొక్కుమ్మడి వెల్వసూపెను. అంతఁ దూరుపు తెల్లవాఱి తెల్పు కన్పించెను. ఇంతలో 'నీగండంబు గడిచెఁగదా!' యంచుఁ బురీజనంబులును గన్నులు విప్పి చూచుచుండ, వీథులం బడి నీరు ప్రవహింపఁ దొడంగెను. అనంతరక్షణంబ యుడుమార్గంబంతయు నున్ననయి శాణోత్తేజనం బొంది, పుల్కడుగంబడ్డ నిశాతఖడ్గముక్రియ నప్పుడు గాన్పించెను.

శివభక్త్యాచారసంపత్తికిం బట్టుఁగొమ్మయగు చిఱుతొండం డాముఱ్ఱేడుదినంబులందు గొంకును జంకును లేక

జంగమము లందఱకును శేవగళ్లిష్టాన్నంబులఁ బెట్టుచు వారలం దృప్తులంగావించుచు నేమంబొప్ప శివపూజావిధుల నొనర్చు చుండెను. ఆచిఱుతొండ దంపతులును, వారి సుపుత్త్రుండగు కుమార సిరియాళుఁడును, వానిదాది చందనికయును నెల్ల వేళల శివభక్తకోటికై యనుపమవృష్టిని బెక్కుభంగులఁ గొని యాడుచు; భక్తులకు శేబవళ్ళు దధిమధురాన్నములఁ బెట్టు చుండిరి. వంటచెఱకులు లేకున్న వస్త్రములు తైలమున ముంచి, మంటఁజేసి వంటకంబులఁ గావించి, శివభక్తవరుల నారయుచు నతిథిపూజ లొనర్చుచుండిరి. వర్షము బోరునఁ గురియుచున్నను వారి కేకొదవయు నొదవకుండఁ జతుర్విధాన్నములను, దియ్యని పాయసంబులను వడ్డించి వారలను సంతృప్తులఁ గావించుచుండిరి.

కోటికిం బడగయెత్తిన యా చిఱుతొండనంబి వీరశైవా చారం బాధారంబుగా శరీరార్థ ప్రాణవంచనంబు సేయక జంగమప్రముఖుల నారాధించుచుఁ గల్పాంతకాలకల్పంబులైన యాదుర్దినంబులఁ దననియమం బుపద్రవంబు నొందకుండఁ గాపాడుకొనుచుండె. మునురుదినంబులలోఁ బ్రతిదినంబును జంగమప్రముఖుం డొక్కడైనను దనపంక్తి భుజించుచుండెను. కాని, వాన వెలిసిన దినంబునమాత్ర మతిథి యొక్కడైనను లేకుండెను. అట్లొక్కరుండును దనపంక్తిని లేకుండ నారగింపని వాఁడగుటంజేసి నాఁడు చిఱుతొండనంబి మధ్యాహ్నకాలంబున వీరమహేశ్వర సమయసిద్ధాంతమార్గానుసారంబున విభూతిని

దేహమునిండఁ బూసికొని, ధౌతపరిధానమును గట్టి, త్రిపుండ్ర ధారియై చేత నమృతాంశుమాళిని ధరించి, ధ్యానముచేయుచు, నెంతయుఁ దత్పరభావంబున నుండెను. పిదప, ధూపదీపనైవేద్యాదుల నతిభక్తి నొనరించి, శివయోగివరుల నారయ వాకిటికి వచ్చియుండెను.

ఏవేళ జూచినను దనవాకిట శివయోగివరులు వేవే లుండెడివారు. ఆవేళమాత్ర మొక్కరైనను లేకుంట కచ్చెరు వొంది వైశ్యప్రభుండు లోని కరిగి, తనభార్యయగు తిరువెంగ నాంచితో "నేఁడేమి యూడెనోగాని శివయోగి యొకండును లేఁడు. మునురుదినములలో మనపంచలఁ బరమపావనమూర్తులును, శైవాచారసంపన్నులును నగు శివభక్తు లిసుకవైచిన రాలకుండ నుందురు. నేఁ డోపద్మాక్షీ! యొక్కరుండును లేఁ డిదేమి చోద్యము! మనభాగ్య మల్పంబగునే? విధికై వేవేగ వెడలి వచ్చెద. నేఁడుమాత్రము నియమపరులు లభింపకపోదురా?" అని పల్కి, "నేను జంగమప్రమథులం బురంబువీథుల వెదకి తేరం బోవుదుఁగాన లింగార్చనములకుం దగినపదార్థంబు కూడం గూర్చుకొని యుండుమా" యని చందనంబును, భూతియుఁ జెందిరయుఁ బుచ్చికొని, దుప్పటంబు ధరియించి చిఱుతొండ నంబి నిజగృహంబువీడి, పురములోనికిం బోయెను.

అంగడులయందు, వైశ్యశ్రేష్ఠుల యిండ్లయందును, భూసురేంద్ర నివాసంబులను, రచ్చపట్టులను, వేశ్యవాటికల యందును, నది యిది యననేల? నన్నిటను భయసంభ్రమములు

దాటుత్రివడఁ జిఱుతొండనంబి జంగమముఖ్యుల వెదుకనారంభిం
చెను. చేఁదప్పి పడినసామ్మ్ము వెదకిన ట్లాపురములో వాడ
వాడలఁ దిరుగుచు, వెళ్లినవాడకే వెళ్లుచు, జూచినవాటికలనే
చూచుచు నాశ్శైవపరుండు జంగమాన్వేషణార్థియై తిరుగఁ
జొచ్చెను.

ఇవ్విధంబున నంబి యెల్లను బరికించి యెందును శివ
యోగివరుని నొకనినైనను గానక తుదకు బాహ్యాళిప్రదేశంబున
నొక్క పాడుగుడి గర్భమంటపంబు జేరెను. అచట శతవర్షదేశీ
యుండును, జరాజర్ఝరిత దేహుండును, బలితపాండు జటామండ
ళుండును, రుద్రాక్షమాలికా భసితత్రిపుండ్రాలంకృతుండును నై
నిజవయోనురూపయగు గుడ్డియవ్వ పాదంబులొత్తుచుండఁ
బులికలాసంబుమీఁద బవళించియున్న యయ్యవారిని గాంచెను.
చిఱుతొండండాతనికి శరణార్థియగుచుఁ గరద్వంద్వము లలాట
మునఁజేర్చి "మాయింట మీరును, నీముసలియవ్వయు నేఁడు
శివార్చనముజేసి, నన్ను గృతార్థునిజేయుట యుక్త".మంచుఁ
దటాలుమనం బ్రణమిల్లెను.

అటక్కరి మాయజోగి తల వడకుచుండ నగద్గదముగ
నంబి నెమ్మోమ్ముముఁ దేరఁజూచి, వ్రాలిన శివయోగివరుని
'శివునికారుణ్య'మంచు నాశీర్వదించి లేవనెత్తెను. అటుల దీవించి
యతనిం జూచుచు, "నీవేమి చెప్పెదవో బిగ్గరగా జెప్పుము.
వీనులు నాకు వినుపించ"వనెను. అంతఁ జిఱుతొండండు కృతాం
జలియై, యుచ్చైస్స్వరంబున "దేవా! మాయింటికి శివార్చనంబు

సేయ దేవియు, నీవును విజయముచేసి, మమ్ముం గృతార్థులం
జేయ విభూతి యందుకొను''మని ప్రార్థించెను.

అంత నాసన్యాసి ''నీవుకోరితివని నే నెటుల సమ్మతిం
తును? నీవంశమును, నీనామమును నెఱింగింపుము. నీవు శివ
భక్తుండ వగుదువా కాదా? నీపెండ్లాము నీవు చెప్పినయట్లు
వినుచుండునా? నీకు సంతానంబుగలదా? నీయింట నేకొదవయు
లేకుండునా? ఇంతయేల? నీ కుల మేదైన నేమి? నీకు శైవ వీర
వ్రతాచార సాహసుం డగుపుత్త్రుఁడొక్కరుం డున్న చాలును.
ఇంక నీవృథాలాపంబులఁ బనియేమి? నామనోరథంబు వివరిం
చెద వినుము. నేను హరు నుద్దేశించి నిరాహారఘోరవ్రతం
బును గైకొన్నవాఁడను. ఆమహావ్రతంబునకు పశూపహారం
బుద్యాపనంబు సేయవలయు. ఈయుద్యాపనంబునకు పశువు
నరుఁడే కావలయును. వానిలక్షణంబు లెట్టివనిన బ్రాహ్మణ
క్షత్రియ వైశ్యజులలో నొకఁడును, గడుచిఱుతవయసువాఁడును,
రోగశరంకావిహీనుఁడును, రూపసియును నగు బాలకుండు యాగ
పశువు కావలయును. ఆబాలుని వానితలిదండ్రులు బాకము
నేసి వడ్డింప భవునకు నివేదనం బొనర్చి, నీవును నీకొడుకును,
నావంక్తిని భుజింపుచుండ నేను భుజించెద''నని చిఱుతొండ
నంబితో ననెను.

వృద్ధుని నియమంబులు సాదరంబుగవిని, చిఱుతొండ
నంబి పరమానందసంభరితుఁడై యిట్లనియె. ''నేను వైశ్యకుల
సంభవుండను; తిరుకచ్చినంబి వంబంధబాంధవుండను. నాపేరు

చిఱుతొండనంబి యంఁడ్రు. నేను శివభక్తులకుం బాదచర్య సేయుచుందును. భక్తుఁడే వ్రతమునుబట్టిన నావ్రతమును బూర్తి గావింపఁజేయు వ్రతము నాది. నీయానతిచ్చిన ప్రకారంబున నయ్యుపహారంబు సేయించెద. స్వామీ! నన్ననుగ్రహించి విభూతి యందుకొనుము; మాయింటికి విచ్చేయుము: అభ్యంగన స్నాన మవధరించిన యంతలోన వంటకంబు లాయితంబులగును.

చిఱుతొండనంబి యివ్విధంబున బ్రార్థింపుచుండ నాశివా రాధకుఁడు మోమ డ్డముగ మోరకునివలె ద్రిప్పి "నేవృద్ధుండ; నీవచఃప్రామాణ్యంబులు విశ్వసింపఁజాలను. ఇంతశ్రమపడి నే నంత దూరము వచ్చినపిదప నీరామారత్నము 'కాదు, కూడ' దనిన నిచ్చోటికి మఱలి రాఁజాలను. నవమాసంబులు భరించి, ప్రసవోద్భవవేదన నోర్చిన తల్లికి సుతుండు ప్రియుఁడో? లేక వృథాభిమానదుర్మదుండగు తండ్రికిం బ్రియుఁడో? నీవె యూహించిచూడుమా. ఇట్టి దుష్కరంబగు కార్యంబున నిన్ను నమ్ముటకు నింతకు గతంబంతలేసి వీరమాహేశ్వర ఘోర వ్రతంబులు నీవుచేసినయవి నే కని విని యెఱుంగను. ముందు వెను కల నూహింపక భక్తిపారవశ్యమున నీ వేమేమో చెప్పినంతనే యెటుల విశ్వసింపనగును? ఇంతకును బుత్రస్నేహంబు నీవు తలంచునంతటి సామాన్యంబైనదికాదు. నీవును, నీభార్యయును విచారించుకొనునది.

"ఇక్కార్యంబు మీ కిద్దఱకును సమ్మతం బగునేని మీయింటికి వచ్చువాఁడను. మీ రాలుమగ లిద్దరును నేక

మనస్కులు గానిచో నిట్టిధర్మంబు పొసఁగనేరదు. మీరిద్ద ఱును సమ్మతింపవచ్చు; సందియములేదు. హంతవ్యుండగు నక్కుమారుం డీకార్యంబునకు నెవ్విధంబున నొడంబడు వాఁడు. 'ప్రాణంబులు తీపి' యనుమాట నీవెఱుంగనిదికాదు. నియమనిష్ఠచే నీకుఁ జంపఁగవచ్చుబో! ధైర్యగరిమచేఁ దల్లి కోర్వఁగవచ్చు! మాకు భుజియింపవచ్చుఁబో! కాని చిఱుత వానికి మనసు తివుట పఱచుకొని చావునకు సిద్ధమగుట దుస్త రము. పడుచిత్తము చంచలమైనది. ఒకపట్టున నిల్చిన మాటి మాటికి నూగులాడుచుండును. తనయాత్మ తన కిట్టిదని యన వచ్చునో, కూడదో. అట్టితఱి నన్యచిత్తముల గుఱించి, యెదిరి కోర్కి యెఱుంగుట యెట్లు? పోయి, నీ రామారత్నముతోను, నీ కుమారునితోను యోచింపు" మనెను.

చిఱుతొండఁడు నిజాంతర్గతంబున తనభార్యకుంగల శివ భక్తివిశ్వాసంబులును, జంగమారాధన నియమనిష్ఠయుఁ దన మాట జవదాటకుండుటయు, కుమారసిరియాళుండును నట్టివాఁ డగుటయు నెఱింగియుఁ శివయోగితో 'నవ్వుఁగా' దనఁజాలక 'మహాప్రసాదం' బని నిజమందిరమునకుఁ బోవునంతలోఁ దిరు వెంగనాంచి యెదురుగ నేతెంచి భర్తముఖారవిందమునుగాంచి 'శివయోగి లభించె' నంచుఁ బ్రమదంబందెను.

అంతఁ జిఱుతొండనంబి శివయోగి వృత్తాంతంబును, వ్రతప్రకారంబును దెలియం జెప్ప నయ్యింతి మిసిమింతురాలు గాక ముసిముసినవ్వునవ్వి "మనశరీరార్ధప్రాణంబులకుం గర్తలు

శివయోగీశ్వరులె కాక మఱియెవ్వరు? వారిసొమ్ములు వారికే సమర్పించుటదియును నొక దొడ్డపనియా? వలచెనేని పుత్త్రి కుండేల? మీరును, నేనును గూడ భక్తునినేమను పారమొందింప సిద్ధమగువారము కామా? పెక్కుమాటలింకేల? భక్తుని వేవేగ దెం" డనెను ఇక్కార్యప్రకారంబు చందనికకు నెఱింగించి మువ్వురు నేకోద్యోగంబున శివయోగికిం బరిచర్య సేయువారైరి. చిఱుతొండండును తోడనే శివయోగిం దోడి తేరం బోయెను.

# 2. భక్తిపరీక్ష — ౨

చిఱుతొండనంబి నిజమందిరమున కరిగినంతనే శివయోగి వృద్ధవేషపుఁ దనరూపువీడి యొండురూపుతో బయల్వెడలెను. కుమారసిరియాళుండు గురువునింట నీలకంఠస్తోత్రములఁ బఠించుచు, ధీగుణాఢ్యై భవంబుచే గ్రహంబులలో నుడురాజునుంబలె తోడిబాలురలోఁ బ్రకాశించుచుండెను. ఆశివయోగి వాని చేరంజనిన బాలకుండు సాష్టాంగ మొనర్చి, నిలచియుండఁ జూచి "అన్నా! పాపాత్ముండగు నీచిఱుతొండనంబి నీకుఁ దండ్రియా? ఆద్రోహి నిన్ను జంపి, వండించి, యొకజోగికి వడ్డింపనున్నవాఁడు. నీవిది యెఱుఁగవైతివి. నీయందలి స్నేహంబున నీ కెఱిఁగింప నే సత్వరంబ వచ్చితిని. కడుపునఁ బుట్టిన కూరిమిబిడ్డఁడును, సుకుమారుఁడును, కులవర్ధనుఁడును నగు సూనుని జేతులార మెడఁగోసి, చంపి, మాంసమునువండి, జోగులకు వడ్డించు గ్రూరులెందైననుం గలరే? వీఁడు దానవుఁడుగాని తండ్రియా? కటకటా! తండ్రి యని నీవు ముఱియుచుంటివి; కులద్రోహి, పుత్రహంతకుఁడు నని యెఱుంగవైతివి; బాలకా! ఇట్టి చిఱుతవాని, నేకైక పుత్రుని మధుపానమత్తుఁ డగుచుఁ జంప నిశ్చయించెఁగదా! ఇట్టి కఠినాత్ములకు విధాత బిడ్డల నేలఁ బ్రసాదించెను? తలిదండ్రులు తమబిడ్డలఁ బెంచి, పెద్దవారలఁ గావించి, పితౄణమును దీర్చుకొందురని పుత్రుల నొసంగెగాని, యొకవ్రేటున మెడఁ

గోసి చంపుటకుఁ గాదుకదా! కంచెయే చేనుమేసిన నింక దిక్కేది? 'జీవన్భద్రాణి పశ్యతి' యను వేదవచనం బవలంబించి, యెక్కడికేనియుం బోయి, ప్రాణంబులు గాపాడుకొనుట నీకుం గర్తవ్యం''బనెను.

ఈమాటలవిని 'హర! హర! యంచు బాలకుఁడు చెవులు మూసికొంచు "మహాత్మా! నీ కిటు లానతీయఁదగునా? నీతో 'నవుఁగా' దనుటకు నాకు భయ మగుచున్నది. పరార్థమై శరీరమును, ధనమును వ్యయింపఁ గల్గుటకదా జన్మనైక ఫలము. దధీచి విజ్ఞానవిహీనుఁడనం దగునా? మేఘవాహనుం డును, శిబియు నల్పబుద్ధు లగుదురా? ఓసంయమివర్యా! 'పరోపకారార్థమిదం శరీర' మ్మను వాక్యంబువినలేదా? అధ్రువంబును, మలభాండమునైన దేహమును బరోపకారార్థము వ్యయించి, ప్రవిమలంబును గల్పాంతరధ్రువంబునైన కీర్తికాయమును బొందుట కార్తయేల?'' నన జటాధారి విని, వీఁడుచిఱుతొండనంబి కంటె నేఁడాకు లెక్కువ చదివినవాఁ డంచు మఱలిపోవుచు, మఱల నాకపట మాయామహానాటక ప్రపంచసూత్రధారుఁ డాకుమారకుని కప్పుడు మూర్ఛ దప్పించెను.

అంత బాలకునిగురువు భయంబందుచుండ, బాలుఁడు నోట చొంగలార్చుచుండెను. శరీరంబంతయుఁ గంపంబంది, గ్రీవారంధ్రంబుననుండి ఘుర్ఘురధ్వనులు పుట్టెను. అంత భూమి మీఁదంబడి, బాలుండు మూర్ఛజెందెను. అచ్చట గురుకులమున హాహాకారధ్వని కోలాహలము చెలరేగెను. దానింగాంచి

దేశికుండు పంచాక్షరీమంత్రమును బఠించి, విభూతి ఫాలమున నుంప, సిరాలుసెట్టి తెలివందెను. భక్తులకు భస్మమేకదా ప్రాణరక్ష! 'ఓ చంద్రశేఖర! భూతేశ! కాలకంధర! హర! కాలకాల!' యంచు నింటికి శివయోగి యేతెంచి, వృద్ధపుదన రూపుతో గుర్రిడియవ్వ చెంతనుండెను.

చిఱుతొండనంబి తనకాంతారత్నము హెచ్చరింప రివ్వున శివయోగివద్దకుం జని, సునాయాసంబుగా యోగిపుంగవునిఁ దనవీఁపున మోసికొని, నిజగృహంబునకుం జనుదెంచెను. ఇంటికిఁ దెచ్చి, వణిజుండు, తానును దనవాల్గంటియు యోగిపరమేశు నకును, నాముసలమ్మకునుగూడ భయభక్తులతోను, వినయ గౌరవములతోను నలుంగువెట్టి, జలకమార్చి ధౌతవస్త్రంబులఁ గట్టించిరి. తదనంతర మేకాంతగృహంబున సర్వోపచార సం భారభరితంబుగాఁ దేవతార్చనకుం బెట్టిన నయ్యాదిమదంపతు లిర్వురు శివపూజావ్యాపారంబునం బ్రవర్తిల్లుచుండిరి.

ఈసమయంబున శివాజ్ఞావశంబునం జేసి పల్లియలనుండి వానిమేనత్త పాయసములను, భక్ష్యములను బ్రియంబొప్ప గొని తెచ్చి కుమారశిరియాలున కొసఁగెను. అంతఁ బదారువర్ష ముల వయసు పచ్చిబాలెంతరాలొకతె కరమున నిత్తడిగంటె బట్టుకొని, 'చిన్నిపాపనికిఁ బాలువోయించుఁ' డంచుఁ దిరువేంగ నాంచిం జేరెను.

తిరువెంగనాంచియుఁ దనప్రియసూనునిం జంపుట కంత రాయమై భవాసి యల్లనవచ్చి బిడ్డకుఁబాలువేఁడ నితరసము

యంబులందునుంబోలె నిరాకులాత్మ్మయై పాలు వోయఁదొడం గెను. భవానియుఁ బాలు వోయించుకొని, తిరువేంగనాంచితో నిట్లనియె. "పురమునందుఁ బ్రజలెల్లరును మహాపాపం బిదేమి యని పలుకుచున్న వారు. అది నిజమో; కాదో కాని మీరఁట కడుపునఁ బుట్టిన బిడ్డని జంపి జోగి కొక్కరునికి భోజనము వెట్టి నున్నారఁట. ఇట్టిపంతి మెచ్చుటనేని వినియుంటిమే! జోగులు కప టోపాయములు వన్ని తిరుగుచుందురు. వారిమాటల విని మీరు ప్రియసూనుని జంపుట యుచితమగునా! ఆవగింజంత భూతి మేనఁ బూసినంతనే గుమ్మడికాయంత వెట్టిపుట్టుగాదె! అట్లుకానిచో, శిశువును నీమగఁడు జంపఁదలంచు టేమి? నీమగఁడు కన్నుగానకుండె నున్నవాఁడు 'మగవాఁడో, మ్రానో', కాని బిడ్డని జంపుటా! ఇదేమి చోద్యము!"

అప్పలుకులు ములుకులువోలెఁ దోపఁ దిరువెంగనాంచి యక్కపటపు జంగమదేవి మాటలు వినక. నిర్వికారంబైన యాకారంబుతో "యమ్మా! శివుఁడన శివయోగి యన భేదంబు గలదే? శరణార్థుల యర్థప్రాణంబులు శివాధీనంబులు. శివుండు కర్త, శివుండు భోక్త. ఈయర్థంబునకుం జింతింపనేల? నీకుం దడవయ్యెడు; బాలెంతరాలవు, పాలు చాలుఁగదా! ఎప్పుడు మాయింటికి వచ్చుచుం బోవుచుండునది" యని కేలుదోయి ఫాలంబునం గీలుకొల్పి, జంకుగానరాక నముచితవ్యాపారంబు లం బ్రవర్తింపుచుండఁ బార్వతీదేవియు నటనుండి యంతర్ధా నంబు నొందెను.

ఆసమయంబునఁ జిఱుతొండసెట్టి భార్య చెంతకేతెంచి 'గురుగృహంబునకుంబోయి పిల్లవానిం దే'మ్మనుచు "నిరుగు పొరుగువారల భాగ్యసంపదలు, కులము నభివృద్ధిజెందగ మన ముద్దుబిడ్డనికి ఏడుగుచేసిన చేతడియారకమున్నె ముక్తికన్యతో బెండ్లి సేయఁగవలయు" ననెను.

తిరువెంగనాంచి వీనులలర నప్పలుకుల నాలకించి 'యట్ల కాక' యని యాచార్యగృహంబున విద్యాభ్యాసము జేయు చున్న కుమారునిం దోడ్కొనివచ్చెను. బాలకుఁడును దన మేనయత్తలాదరంబుతోఁ బెట్టిన భక్ష్యంబులను భక్షించుచుఁ దలిదండ్రుల నూరించుచు నింటిముంగిట జరించుచుండెను. జననీ జనకు లాబాలుని జడ యల్లికను విప్పి, కమ్మని సంపంగి నూనెతో శిరమునంటి నులివెచ్చనినీటఁ దీర్థమాడించి, వేణి యీటార్చి, సురపొన్నవిరులు పొందుగ ముడిచి, కండ్లను గాటుకవెట్టిరి. పిమ్మట భసితరేఖాత్రిపుండ్రంబు నొసటఁదీర్చి, చిన్నికుమారునితో నిట్లనిరి. "ఓ ప్రియనందనా! నిను పాక ముగా నొనర్చి, భైరవయోగి కొరకునికి భోజనము పెట్టు చున్నవారము. నీ హృదయమునందు సంసారముఁ బాయఁ జాలని విచార మొకింతేనియు లేదుగదా!"

వీనుల విందొనరించు నాపలుకుల సంతసంబున నాల కించి, కుమార శిరియాళుఁడును "నామనమునందు సంసార భ్రమ యొకించుకేనియు లేదు. నే నాశివునకు, మాయామహా యోగికి మాంసాహార మయ్యెదను, మీరే గురులు; హింసా

క్లేశమును మానుఁడని మిమ్మిదె ప్రార్థించువాఁడ" ననెను. చావ సిద్ధయించిన పుత్రికకును, జంప సంసిద్ధులైన దంపతులకును వీరమాహేశ్వర వ్రతమార్గమున దారతమ్య మెద్దియేనియుం గలదా! ఇవ్విధంబున మువ్వురును జందనికాపురస్సరంబుగా నేకనిశ్చయులైరి.

తదనంతరమునఁ బాలిచ్చురీతిని పసిపాపని దల్లి తన తొడలపైఁ బరుండఁబెట్టెను; చందనిక కాళ్లు క్రింద నణచిపట్టియుంచెను. చిన్నిబుగ్గల లేతచిఱునవ్వొప్ప శిరియాలుండు చేతులు జోడించెను. అంతఁ జిఱుతొండనంబి కొమ్మయగారు చురకత్తి వాఁడిగా నూఱుచు వంకదీర్చెను. అట్లు మువ్వురి హృదయంబులును నేకమై లోనిసుమంతయుఁ గుందక నేకవాక్కున "బాలకా! నీమదిని శంకింపకుము. మావలని ప్రేమస్నేహవాత్సల్యసంపద వాటింపకుము; నాలుకతుదిని బదిలంబొప్పగఁ బంచాక్షరీమంత్రంబు బఠింపుచుండుము. ఇదియే పరబ్రహ్మమార్గము." ఇట్లనుచు నంబిభామిని మనమున శంకయొకింతయేనియు లేక తనయూరువు దాపుఁజేసి, యతితీక్ష్ణంబగు కత్తి మోపినంతనే మెడగ్రక్కునఁదెగి, శిరాలుశిరంబు వసుంధరాస్థలిం బడి 'నమశ్శివాయ' మంత్రంబు పఠింపుచుండెను. శిరియాలుశిరంబు దెగినను, శిరియాలకుమారుని వక్త్రచంద్రిందు కందక; గాజువాఱక; వికారముదప్పక; నెమ్మది నిద్రవోవునట్లుందము నొందెను. వానింగాంచి, తలిదండ్రులు లిద్దరును గడుముదంబందిరి. పందె మొడ్డి గెల్చినరీతిని, అప్పు నిశ్శేషంబుగా

దీర్చిన నిశ్చింతనుండుకై వడిని సతియుఁ బతియును బ్రియ కుమారకుని వధించి, వీరశైవవ్రతంబు సొంతంబు గావించిరి.

పిదప మిరియము, నుల్లి, పసుపు, మెంతి, నిఁగువ, జీరకంబు, శర్కరయు, జింతపండును, గమ్మని నేయి, తైలమును, పెరుగును మేళవించి, శిరియాలుని మాంసమును బెక్కువిధముల పాకశుద్ధి యొప్ప షడ్రసోపేతములుగాఁగ వంటకము జేసెను. వంటకమైనంతనే భోజనశాలలో నన్నియుఁ బేర్చి, రత్నకంబళంబును బఱచి, దేవతార్చనకు వలయు ధూపదీపాదుల సమకూర్చిరి. అంత, 'సర్వంబు నాయితంబయ్యె; నయ్యగారి కారగింపంగ సమయంబయ్యె' నని యతివ జంగమసిద్ధునితోఁ జెప్పెను. చిఱుతొండనంబి సత్వరంబుగాఁబోయి వృద్ధుని, సంధురాలగు ముదుసలియవ్వతోడ భోజనశాలకుఁదోడ్తెచ్చెను.

తదనంతరము కొడుకు పాలమే లోగిరంబుతోడం గూడ భరితభోజనంబుగా, వడ్డించి, గుడ్డియవ్వకుసైత మట్లనే సమర్పించి, "దేవ! భక్తవత్సల! శివయోగీశ్వరరూప విరూపాక్ష! యమృతాహారం బారగించి రక్షింపు" మని చిఱుతొండఁడు భార్యయుం దానును నమస్కరించిరి.

అంత నాభైరవరూపుఁడాగి పసిపాపని మాంసము కూరలందు శోధించి చూచి, శిరోమాంస మేమియు లేమిజూచి "వణిగ్వర! యీ నీరసమాంసమేల? నీపుత్రుని యుత్తమాంగముం గూరలు సేయవైతివి. ఔ లెమ్ము. నిజపుత్రవిసర్గమోహము లెటుబోవును? కటకటా! మావ్రతమంతయు

భగ్నంబాయె. ఉత్తమాంగపు మాంసమును విడచి, యీ యధమాంగమాంసము మాకేల? దానిని మేమెటుల భుజింతు" మనిరి. ఇట్లనిన విని చిఱుతొండండు భయంపడి వెలవెలం బారుచుఁ దిరువెంగనాంచి వదనం బాలోకించి 'యింక నెట్లనిన నామెయు నామాంసమును ముందటంబెట్టి 'చందనిక! యిది యేను మొదలన బెడంగకొండ్రగు యోగిబృందారకులచందం బెఱింగినదాన నగుటంజేసి పాకంబుఁ జేసికొనియున్న దానను, తపస్విచిత్తం బేపాకంబును బొందకుండ నడ్డించెదంగా' కని యట్లుచేసిన, నక్కుహనాభైరవుండు వెండియు "ఓ పరమ పుణ్యా! నీవు నాబంతి నారగింపక నాకు భోజనముసేయఁ జేయాడునా? 'ఒకఁడు భుజియించు టెన్నడు నొప్ప' దనెడు వేదవాక్యము నీవు వినియుంటివికదా! మఱియు నొక్క భోజననియమంబు గలదు. పిన్నవాఁడు బంతిభోజనంబుసేయక కూడు నోటికిం బోదు. మగబిడ్డండులేని నిర్భాగ్యునింట భోజనంబు సేయఁగూడదు. 'అపుత్రస్య గతిర్నాస్తి' యనవిందువేకదా! అట్టి గతిహీనులిండ్ల మావంటి తపోధనులు భిక్ష గైకొందురా? నీకుమారు నాబంతికి రప్పింపు మారగించెద" మనెను.

"ఇంక నేమిసేయువాఁడ" నంచుఁ జిఱుతొండండు నిర్విణ్ణుఁడగుచుండఁ దిరువెంగనాంచి యక్కుహనాసన్యాసితో నిట్లనియె. "దేవరవారు మొదలనె యానతిచ్చితిరి. మేమును జిత్తమునం దట్లనే తలంతుము. నాకింకను గుమారుండుగలఁడు.

వాఁడుండేని యాటకుఁ బోయియుండు; లేదేని చదువం బోయెనో, పిల్వఁబంచెద. కాని, యింతలో మహాత్మా! కూరలు చల్లనారవె?"

అనిన నత్తపోధనుఁ డిట్లనియె "నీ యుత్తమాంగన యెలుగెత్తి నలుదిక్కులం బిలుచునది కుమారుండు వచ్చెనేని బంతిఁ బెట్టుకొని భుజింతము. తల్లి పిల్చిన రానితనయుండు గలఁడె? రాకుండెనేని; నేమును నీముసలియవ్వయుఁ గుడుత, మటుగాక యీ ఉగ్గొడ్డెఁబులు పలికి, నీ పడ్డపాట్లు చెఱుపంగల వారమె?" యనిన 'బ్రసాదం' బని, పతి యనుమతిం బురంధ్రీ రత్నంబు "ఓ వణిగ్వంశవారాశి హిమధామా! వేవేగ రారా! ఆలసించెద వేల? రారా! వీరస్వరాంభోరుహార్క! ఓ మహా ఘోరవీరశైవాచార! తడవేలఁ జేసెదవురా! అపారసంసార దూర! నాతనూజ! నాప్రాణపదము!" యంచు గారాపుఁగొడు కును బిల్వం దొడంగెను. అవ్వనితారత్న మిట్టుల పర్యాయ క్రమంబొప్పగా సమస్తదిక్కుల నెలుగెత్తిఁ 'చిన్నికుమార! రార!' యంచుఁ బిలువం దొడంగెను

అంత నాబాలుండును మహాశ్రీమప్రచారంబున నచ్చోటికి చేతెంచెను. శిరాలు తండ్రికి హృదయాహ్లాదంబు పొంగి పొరల శంభుండు తనకట్టెదుటఁ బ్రత్యక్షంబయ్యెను. అప్పుడు భయభక్తితాత్పర్యంబులు మనంబున ముప్పిరిగొన నప్పరమ మాహేశ్వరు నిట్లని స్తుతియించెను. "జయజయ! హాలాహల నీలకంధర! మహేశా! భక్తచింతామణీ! గంగాధర! చంద్ర

శేఖర ! జగత్స్వామీ ! కృపాంభోనిధీ!" యనుచుఁ బలు తెఱంగుల శంభుని స్తుతియించెను. ఇట్లు ప్రత్యక్షంబైన విరూపాక్షుండు "చిఱుతొండనంబీ! నీవు తుంబురుండవు; శిరియాళుండు కుమారస్వామి; తిరువెంగనాంచి యచ్చర, మీరిద్దఱొక్కొక్క కారణంబున మర్త్యయోనిం జనియించితిరి. మీ స్థానంబులనుండి తొంటిచందంబున నన్నుం గొలువుఁడు; శరీరంబులతోడం గైలాసంబునకు రం" డని యాజ్ఞాపించెను.

ఇట్లనుగ్రహించిన, చిఱుతొఁడనంబి వెండియు "తారకరాజశేఖర ! ఈ యేదువాడలవారము గలసి వీరమాహేశ్వరాచారంబు వదలక వర్తిల్లుచుందుము. ఇట్టి నాబాంధవుల విడనాడి నే నొకండ రాబుద్ధిరాదు. నీకొడంగూడెనేని మమ్మం దఱఁ గొనిపొమ్ము. లేదేని మేమందఱము నిచ్చటనే యుండి, నిన్ననిశము గొల్చుచుందు" మనెను. శంభుఁడంత గరుణించి 'యేదువాడలు గదలివచ్చునది; నీకుం బ్రియంబగు నివ్వరం బిచ్చితి'నని యానతిచ్చిన తక్షణంబ కంచిలోగల నేడువాడలందలి నానాపుగోమటు లందరితోను, నఖిలజీవరాసులతోను గూడి నంబిసెట్టి భాసురస్ఫూర్తి కైలాసమునకు నేగెను.

## ౩. ద క్షా ధ్వ ర ము.

దక్షప్రజాపతి వనజజునివలనం బ్రభవించి, మనునిజనం దన యగుప్రసూతి నుద్వాహం బయ్యెను. వారికిం బదియార్వురు కన్య లుదయమందిరి. అందుం బదుమువ్వురను దక్షుండు ధర్మరాజున కిచ్చెను. ఒక్కకన్యక నగ్ని దేవునకును, నొక్కతెం బితృదేవతలకును, కడపటి దగుసతీదేవిని జననమరణాదినివర్తకుం డగునభవునకుం బెండ్లిసేసెను. ఆపదుమువ్వురియందు మూర్తి యనుదానివలన సకలకల్యాణగుణోత్పత్తి స్థానభూతులగు నరనారాయణులను ఋషులిద్దఱు సంభవించిరి.

తొల్లి బ్రహ్మలు సమస్తజనులు నుతింప నొక్కసత్త్రిము నొనర్పం బూనిరి. అద్దానికి సరసిజగర్భుండును, యోగిజనంబులును, మునీంద్రులును, ప్రజాపతులును భక్తిమెయిం జనుదెంచిరి. అంతట భానుసమాన తేజుండగు దక్షుం డట కేతెంచినం బితామహభర్గులు దక్కనందఱును నాదరంబున లేచిరి. ఆదక్షుండును వనజజునకు మ్రొక్కి, సభ్యులు భక్తిం దనకిచ్చిన పూజలు గైకొని యర్హాసనమునందుం గూర్చునియుండెను. అంత నాతండు తన్ను గాంచి సభ్యులందఱును లేవ నాసనమును దిగనట్టి పురారిని రోషారుణితలోచనుండై చూచి, "విబుధమునివహాతాశనాది సురోత్తములార! నామాటలు వినుండు. ఈపురవైరిని జూడుండు. ఇతండు దిక్పాలయశోహానికరుండు. ఈక్రియాశూన్యపర్వునిచేత సజ్జనాచరితము దూషితం బయ్యెను. మహితసావిత్రీసమానయు

మృగశాబనేత్రియు, సాధ్వియు నగునాతనూజను సకలభూమీసురజనసమక్షమునఁ గరగ్రహణముజేసెగదా! ఈమర్కటలోచనుండు నేను వచ్చినంతనె ప్రత్యుద్గమాభివందనము ప్రీతి నడువకుండిన నడుపకుండుఁగాక! నన్నుఁ గని నోర మాటాడుటకు నాలుక క్రొవ్వెనే? ఏఁ డనయము లుప్తక్రియాకలాపుఁడు, మానహీనుఁడు, దిగంబరుఁడు, భూతప్రేతపరివృతుండు; తామస ప్రమథభూతములకు నాథుండు. అశుచియైన యితనికి శివుఁ డనునామ మెటులుగలిగెను?'' అనుచుఁ బ్రతికూలవచనంబులు పలికి, శర్వుని శపియింతు నని కరమున జలములుగొని, రోషమున "ఇతఁడు యాగహవిర్భాగముల నొందకుండుఁగాక!" యని శపియించెను.

ఆతని గర్హితవాక్యములు భగవంతునందు నిందితంబులు గాక స్తుతిరూపంబున నొప్పెను. తదనంతరంబ రుద్రునకు శాపం బిచ్చినకారణంబున దక్షుండు సదస్యముఖ్యులచేత నిషేధింపం బడి, పరివృద్ధంబైన కోపంబుతోఁ దననివాసంబునకుం జనియె. అంత గిరిశానుచరశ్రేష్ఠుండగు నందికేశ్వరుండు కోపారుణితలోచనుండై "ఈదక్షుండు మర్త్యశరీరంబు శ్రేష్ఠంబుగాఁ దలంచి, భగవంతునందు భేదదర్శియై యపరాధంబు గావించెను. వీఁడు బుద్ధిచేత నాత్మతత్త్వంబు మఱచి పశుప్రాయుండగును. ఇంతియకాక వీఁడు చిరకాలంబు మేషముఖుండగును. గౌరీశుని దిరస్కరించిన వీని ననువర్తించువాఁడు జననం బందుచుఁ జచ్చుచు వర్తిల్లుచుండు." ననుచు హుంకరించెను. అట్టియెడ

విమనస్కుండగుచు ననుచరసమేతుండై భవుం డచ్చోటువాసి చనియెను.

అంత మామయగు దక్షునకును, జామాతయగు భర్గునకును నన్యోన్యవిరోధంబు పెరుగుచుండ నతిచిరకాలం బరిగె. రుద్రవిహీనంబైన యాగంబు లేనిదియైనను శర్వుతోడి పూర్వ విరోధంబునను, పరమేష్ఠికృతంబైన సకలప్రజాపతి ప్రభుత్వం బుననుం జేసిఁ దక్షుఁ డరుద్రకంబుగా వాజపేయసవనంబు గావించి, పిదప బృహస్పతి సవననామకంబైన మఖంబుసేయ నుపక్రమించెను. ఆమఖము గన్గొను వేడుకచేఁ బరమముని ప్రజాపతిసుపర్వమహర్షి వరులు తమభార్యలతోడంగూడ వచ్చిరి. వారందఱును శుభస్థితి దీవన లిచ్చి, సమ్మదంబున దక్షుచేత విహితపూజల నొందిరి.

గగనచరు లాసవనమహిమ నుతింప దక్షతనయయగు సతీదేవి విని కుతూహలంబునొంది వినువీధిఁ జూడఁ దదుత్సవ దర్శనకుతూహలులై భర్తృసమేతలగుచు మించువేడ్కతో, మానితములైన దివ్యవిమానయాన లగుచు నాకాశమార్గమున నరుగుచున్న ఖచరగంధర్వకిన్నరాంగనల నామె గాంచెను. ఆమె తనపతియగు పశుపతిం జూచి, "యీమామ ప్రజాపతి సుప్రీతమతియై మఖము నొనరించుచున్నవాఁ డట వింటిరే! దేవ! మన మిపు డచటికిఁ బోవ నాకు వేడుక జనించుచున్నది. ఆయజ్ఞమును గనులారఁ గాంచుటకు నాయనుజులు ప్రాణ నాథులతోడ వత్తురు. నేను వారి నచట జూడఁగవచ్చును.

దేవా! మహాశ్చర్యకరంబై గుణత్రయాత్మకంబగు ప్రపంచంబు భవదీయమాయావినిర్మితం బగుటం జేసి మీకు నాశ్చర్యకరంబు గాదు. అయినను, భవదీయ తత్త్వం బెఱుంగఁజాలక కామినీ స్వభావంబు గలిగి మదీయజన్మభూమిఁ గనుంగొన నిచ్ఛించితి. అభవా! జనకు నింటగలుగు సుఖములను దనయలు చని సంప్రీతినొంద కేరీతి సిలువ నేర్తురు? పిలువకయుండఁ జను టనుచితమందువా? అట్లుగాదు; సజ్జనులు బిలువకున్నను జనక గురుసుహృజ్జననాయకగృహములకుఁ జనుచుందురు. దేవా! నాయందుఁ బ్రసన్నుండవై మదీయమనోరథంబు దీర్పుము. సమధికజ్ఞానంబుగల నీచేత నేను భవదీయదేహంబునం దర్ధంబ నైతి. అట్టి నన్ననుగ్రహింపవలయు" నని ప్రార్థించెను.

దేవుఁ డంత మందస్మితవదనారవిందుండగుచు, జగత్స్రష్టల సమక్షంబున దక్షుండు తన్నాడిన నిందావాక్యముల మదిం దలంచి యిట్లనియె. "ఓకల్యాణి! నీమాట కడు నొప్పును. బంధువులు పిలువకుండినను సంప్రీతితోఁ జనుదు రంటివి. ఇదియును లెస్స. వారు ఘనకోపదృష్టులుగా రేనిఁ బోఁదగును. వినుము; వినుతవిద్యాతపోవిత్తవయోరూపములు సుజనుల కనుగుణంబులు. అవియు కుజనులయెడ దోషహేతుకంబులై వివేకంబు చెఱుచును. మహాత్ములైనవారి మాహాత్మ్యమును జనులు గర్వమునఁ బొడఁగానరు. అట్టివారి యిండ్లకు బంధుసరణిని బోవంజనదు. మానవుఁ డిష్టబాంధవుల దురుక్తులు మర్మము లంట నాటుటం జేసి, చిత్తమున నహర్ని

శము పరితాపమునొంది కృశించును. నీవు దక్షునకుఁ గూరిమి సుతవైనను నాసంబంధంబున నీజనకునిచేతఁ బూజపడయఁ జాలవుసుమా! అది నీకు సతనికి విరోధంబునకు హేతువగును. మద్ద్వేషియైన దక్షుండు భవజ్జనకుండైనను, నాతఁడును దదను వర్తులైనవారలును జూడఁదగరు. మద్వచనాతిక్రమంబు జేసి యరిగితివేని నీ కచట పరాభవంబు సంప్రాప్తంబగు” నని పలికి, యభవుండు పోవ్మని యనుజ్ఞ నిచ్చి యచ్చట యవమానంబునంజేసి యశుభంబగును. పోవ్మనక నివారించిన మనోవేదన యగునని మనంబునం దలపోయుచు నూరకుండెను.

సతీదేవి యత్యంత వేదననొంది కుపితయై భవుని విడిచి; మూఢాత్మయగుచు నావెలది జనకుని జూచెదువేడుక నరిగెను. ఆమె నంత రుద్రానుచరులు వృషభేంద్రయానఁ జేసి, యజ్ఞభూమార్గులై యరిగిరి.

ఆమె మనమునఁ గడుమోదమందుచు యజ్ఞశాలం బ్రవేశించెను. ఆమగువను జననియు, సోదరులుదక్క నెవ్వరును దక్షువలని భయంబునంజేసి యాదరింపరైరి. జనకుం డవమానించుకతంబున, సోదర లుచితక్రియఁ జేసిన పూజల నందక యామె ద్యుతిదొలంగియుండెను. ఆమె తండ్రిచే నాదరింపఁబడనిదై విభుండైన యీశ్వరునందు నాహ్వానక్రియాశూన్యత్వరూపంబైన తిరస్కారంబును, నరుద్రభాగంబైన యజ్ఞంబునుం గనుం గొని నిజకోపానలంబున లోకంబులు భస్మంబుసేయం బూనిన తెఱంగున న్వర్తించెను. అంత రుద్రవిద్వేషియుఁ గ్రతుకర్మ

భ్యాపగర్విష్ఠుండు నగుదక్షుని వధియింతు మనుచు లేచిన భూతగణంబుల నామె నివారించి, రోషవ్యక్తభాషణంబుల నిట్లనియె. "సకలకారణుండును, నిర్మత్సరుండునైన రుద్రు నందు నీవుదక్క నెవ్వండు ప్రతికూలం బాచరించు. మిము బోంటివారలు పరులవలని గుణంబులందు దుర్గుణంబులన యాపాదింతురు. కొందఱు సాధువర్తనులు పరులదోషంబుల నైన గుణంబులుగా ననుగ్రహింతురు. కొంద- ఱుత్తమోత్త ములు పరులయందు దోషంబుల నాపాదింపక తుచ్ఛగుణం బులు గలిగినను సద్గుణంబులుగా గైకొందురు. అట్టి మహా త్ములయందు నీవు పాపబుద్ధి గల్పించితివి. అనయము 'శివ' యను రెండక్షరంబులను బ్రీతితోఁ బలికి, భావంబునం దలంచి నంతనె సర్వజీవుల పాపసంఘములు చెడును. అట్టి మహాత్మా త్మునందు నమంగళుఁడ వగునీవు విద్వేషివగుట యాశ్చర్యంబు. వాక్పతిముఖ్యులును నమ్మహాత్ముని చరణసరోజరేణువులు నమ్మతిని మస్తకములందుఁ దాల్తురు."

"ధర్మపాలనవినిర్మలుఁ డగుభర్గుని దిరస్కరించు కలు షుని జిహ్వ గోయఁదగును. అట్లు సేయశక్తి చాలనివాఁ డగు నేని దాన బొలియుట యొప్పును. ఈరెంటికిని బ్రభుత్వము చాలనివాఁడు కర్ణరంధ్రములు మూసికొంచు వెడలిపోవుట పాడియని ధర్మవర్తనులు వచింతురు. జనుఁడజ్ఞానముచేత భుజిం చిన జుగుప్సంబైన యన్నమును వెంటనే వెళ్ళించి పవిత్రుఁ డగురీతి నీహేయభాజనమైన శరీరమును విడచి నేను బ్రకాశిం

చెదను. నీవు దుష్టాత్ముండవై ఘనుండైన యీశ్వరుని నిందింప నీతనూభవననుట నే సహింపంజాలను. ఆబ్రహ్మభూతుండైన సదాశివునిం గ్రియాశూన్యుండని నిందించుట పాపంబు. నీమన మున నధికసంపన్నుండవనియు, రుద్రుండు దరిద్రుండనియు గర్వింపంజనదు. నీవు నీలగళాపరాధివి. నీకు నేను తనూభవ నౌట చాలదా? చాలును. నీదు తనూజాత ననుటకు నాకు సిగ్గగు చున్నది. హరుండు పరిహాసవాక్యముల 'దక్షతనూభవ'యనంగా నేను సహింపంజాలను. ఆదుఃఖము ననుభవించుటకంటెం జచ్చు టొప్పగు" నని యజ్ఞసభామధ్యంబునం బలికి, జలంబుల నాచ మనంబు చేసి, శుచియై, సతీదేవి మౌనంబు ధరియించి, భూమి యం దాసీనయగుచు శరీరత్యాగంబు సేయందలంచెను. నాధుని దక్క నన్యంబుజూడక యామె నిజయోగ సమాధిజనితంబైన వహ్నిచే దగ్ధయయ్యెను.

సతీదేవి శరీరత్యాగ మొనర్చినంతనే హాహారవము చెల రేగి సభాసదు లందఱును "అకటా! మదిరాక్షి దక్షుతోడి వైర కారణమున దేహము వదలెంగదా! తనసమక్షమందు తనూజ కాయంబు దొఱంగంగ గనుచున్నవాం డిట్టిదురాత్ముం డెందేనిం గలండె?" అనుచు వా రాశ్చర్యనిమగ్నులైరి. దేహమువిడిచిన సతినిగాంచి, యామెతోడ నేతెంచిన యనుచరులు బాహాదర్ప మెలర్ప నసిగదాపాణులై యాద్రోహిం ద్రుంపనుద్యుక్తులైరి. అం తట దేవత లుదయించి, ప్రమథగుహ్యకగణంబులం బాఱందోలిరి. అనంతరము నారదునివలన నీశ్వరుండీవృత్తాంత మంతయువినెను.

నీలకంఠుఁ డుగ్రుఁడై జ్వాలాచక్రమధ్యంబున దనజటను బెఱికివైచెను. అంతట నఖిలలోకభయంకరుండగుచు మాఱట రుద్రుఁ డనగ వీరభద్రుఁ డుదయించెను. వీరభద్రుఁ డెదుట నిలిచి, వినయమెసఁగ దనవేయిచేతులు మొగిచి, "నే నేమి సేయవలయు నానతి" మ్మనెను. ఆతని కభవుం డిట్లనియె. "గురుభుజశౌర్య! భూరిరణకోవిద! మద్భటకోటి కెల్ల నీవు వరూథినీవరుఁడవై చని దక్షుని దునిుంపుము." రుద్రుఁడు కుపితచిత్తుఁడై యాజ్ఞాపించిన వీరభద్రుఁడు "అట్లుకాక" యని యాతనిం జేరి ప్రదక్షిణం బాచరించి, వీడ్కొని యనివార్యవేగమున భీషణప్రభలు దనరుచుండ కృతాంతకాంతకశితస్ఫుటశూలమును బూనెను. ఆతఁడు సరభసవృత్తి నరుగుచుండ సైన్యపదాహతపాదధూళి చూచి సభ్యులును, దక్షుఁడును నివ్వెఱపడి యిట్లు చింతింపఁదొడంగిరి. "ఈధూళి పుట్టుటకు హేతు వెయ్యదియో! ఇది విలయసమీరమా! గోగణాళిరాక కిది సమయంబు గాదు; కల్పావసానంబుగాఁబోలు, కాకున్న నిట్టి రజ మెందేని గలదె?" యంచు వారందఱు భయమందిరి. అంత పరిసూతిముఖ్యులైన భూసురకాంత లిట్లనిరి. "ఇది యీదక్షుని పాపపరిపాకము; ఒండుగాదు. అంత దక్షుండును నిది రుద్రుని కోపాటోపసంరంభం బని భయంపడఁజొచ్చెను.

'అఖిలసంహారకారణుండై నటించునట్టి దేవుని రోషింపఁజేసిన మంగళములఁ బొందవచ్చునె' యని భయవిహ్వలలోచ[illegible] గణము పలుకుచుండిరి. ఆసమయంబున మహా

త్స్వాంతుడైన దక్షునకు భయావహంబులై సహస్రసంఖ్యాతంబులైన మహోత్పాతంబులు భూనభోంతరంబులం గానంబడుచుండెను. ఆసమయంబున రుద్రానుచరులు నానావిధాయుధంబులు ధరియించి యజ్ఞశాలాప్రదేశంబులం బరువులు వెట్టుచుండిరి. కొందఱు సదస్యశాలయుఁ, గొందఱు యజమానశాలయు విధ్వంసంబులు గావించిరి. కొందఱు మునుల బాధించిరి. మఱి కొందఱు దేవతాసరోధంబు గావించిరి. వీరభద్రుండు దక్షుని, జండీశుఁడు పూషుని బట్టిరి. దక్షుని జంపగాలేక వీరభద్రుండు తద్వధోపాయంబు దనచిత్తమునఁ జూచి, వాని మస్తకము దున్మి యంచితామర్షణమున దానిని దక్షిణానలమున వేల్చెను. ఇట్లు వీరభద్రుండు దక్షునియాగంబు ధ్వంసంబుగావించి, కైలాసంబునకుం జనియెను.

హరభటకోటిచేత సంభవించిన యుపద్రవమును గాంచి, సురలు భయాకులాత్ములు లగుచు సరసిజాసనుఁ జేరి విన్నపము సేసిరి. అంత 'శరణాగతరక్షకుండగు నీశుని జేరంబోవుద' మని పద్మసంభవుండును, దేవపితృగణప్రజాపతులునుఁగూడి కైలాసాభిముఖులై చనిరి.

. అందుజ్జ్వలంబై భక్తజనులకు నిచ్చలు ప్రమదమొసఁగ వలయునంపగల నిచ్చు వటవృక్షమూలతలంబున నున్న శాంతవిగ్రహుని, బాలచంద్రభూషణుని యోగీంద్రులు వినుచుండ నారదునితోఁ బ్రియభాషలు జరుపుచున్న రుద్రుని గాంచిరి. లోకపాలురును, మునిజనులును సద్భక్తి సతనిర్భరణంబులకు విన

తుష్టులైరి. అం దబ్జాసనుం గాంచి హరుఁడు బ్రీతితో నాతని కభివందనము గావించెను. అపు డాకమలభవుఁడు శర్వుఁగని మందహాసముతోడ నిట్టుల బలికెను. "నిర్వికారబ్రహ్మంబ వగు నిన్ను విశ్వనాథుగా నే నెఱిఁగెద. ఈశ! నీవ ఈవిశ్వజననవినాశవృద్ధిహేతు వగుచుందువు. నీవు సర్వజ్ఞుఁడవు; మాయచేత మోహితాత్ములై కర్మవర్తనులైనవారివలన ద్రోహంబుగలిగిన నీవు బ్రోవవలయు. యజ్ఞభాగార్హుండవయిన నీకు సవనభాగంబు సమర్పింపనికతన సమాప్తినొందని దక్షాధ్వరంబు మరల నుద్ధరించి, దక్షుని బునర్జీవితుం జేయుము. భగుని నేత్రంబులును, పూషుని దంతంబులును గృపసేయుము. భగ్నాంగులైనవారి కాయంబులకు నారోగ్యంబు గావింపుము. ఈమఖావశిష్టంబు యజ్ఞపరిపూర్తిహేతుభూతంబైన భవదీయభాగం బగుఁగాక!"

చతురాననుఁడు వినయంబున వేడిన నిందుమౌళి ప్రీతచిత్తుఁడై "హరిమాయచేతఁ బామరులైనవారు చేసిన యపరాధదోషముల నే నెన్నడును గణియింపను. అయినను బలియుర దండించుటయును, దుర్బలజనరక్షణమును ధర్మపద్ధతి యగుటంజేసి కలుషాత్ములను వారియపరాధములకొలఁదిని దండించుచుందును. కావున దగ్ధశీర్షుండగు దక్షుఁ డజముఖుం డగును. దేవతలు హవిర్భాగంబు నా కొసంగుటంజేసి సర్వావయవపరిపూర్ణులై వర్తింతురు. తక్కుంగలవా రందఱును నారోగ్యంబు నొందుదు" రని శివుం డానతిచ్చిన సమస్త

భూతంబులు సంతుష్టాంతరంగులై సాధువాదంబుల భవు నభి నందించిరి. అంత వా రందఱును రుద్రునిం బురస్కరించుకొని దక్షాధ్వరవాటంబునకుం జనిరి. శర్వుని యోగశ్రమమున ఋత్విగాదులు సర్వావయవములుగలిగి పూర్వ తనుశ్రీల నొప్పిరి. దక్షుఁ డంత నిద్ర మేల్కొని లేచినపోల్కిని నిలిచెను. ఆతఁడు లేచినిలిచి ముందఱనున్న శివునిం గనుంగొని పూర్వ రుద్రవిద్వేషజనితంబులైన కల్మషంబులు బాసి నిర్మలుండై యభవుని నుతించి, రుద్రక్షమాపణంబు గావించి, పద్మసంభవ భవులచేత ననుజ్ఞాతుండై హాయి యాగంబు నిర్విఘ్నంబుగాఁ బరిసమాప్తి నొందించెను. అందఱును సంతుష్టాంతరంగులై రుద్రుని మహిమాతిశయంబులను వేనోళ్ళ నుతించిరి.



# 4. పార్వతీ జననము

తారకుం డనుమహాసురుఁడు ఘోరం బగుతపం బాచరించి, బ్రహ్మవలన వరములం బడసెను. బ్రహ్మదత్తంబగు వరానుభవమున నాతఁడు త్రిలోకంబుల నేలుచు; బృందారకులను, మహర్షులను ననిశంబును నిష్కారణ తీవ్రబాధలం బెట్టుచుండె. నిశీథంబున దీపకలికాస్తంభంబులంబోలె రాక్షసుని శుద్ధాంతంబులందు శేషవాసుకిప్రభృతు లేమరకయుందురు. మార్తాండుండును నాదనుజుని పురంబున నెంతమాత్ర మెండ కావలయునో యంతమాత్రమే ప్రకాశించును గాని దాని నతిక్రమింప వెఱచుచుండెను. మార్తాండుఁ డెంతమాత్రము కాసినను దానవుని కేళిదీర్ఘికలందలి పద్మము లెలమిఁ బొందుచుండెను.

ఆదైత్యుఁ డిచ్ఛావినోదంబుగఁ జిక్కని వియద్గంగా ప్రవాహంబులోపటి హైమాంబుజనాళముల బెఱుకుటకు దేవాళిని నియమించుచుండెను. వారును నోరు వాయెత్త వెఱచుచు, భయసంభ్రమములతో వానిచిత్తానువర్తనులై మెలంగుచుండిరి.

ఇవ్విధంబునఁ దారకాసురుండు కాలనేమిప్రధాననానా బంధుసహాయుండై పాకశాసన, పావక, పరేతరాజ, పలలాశి, పాశిపవనపౌలస్త్య, పన్నగాభరణులఁ బరిభవించుచుండెను, నిర్జరులం దర్జించి, కిన్నరుల వెన్నుసూచి, కింపురుషులఁ జంపి,

గరుడుల బడలుపఱచి, గంధర్వుల బంధించి, గుహ్యకుల సంహరించుచు నుండెను. అంతియకాక, యక్షుల నధిక్షేపించి, ఖేచరుల గీటడగించి, యచ్చరల హెచ్చు గుందాడి, సిద్ధులకు బుద్ధిసెప్పి, సాధ్యుల సాధించి, మహారాజికుల రాజసం బుడిపి, విద్యాధరుల నధఃకరించుచుండెను. మఱియు, మహాఋషుల నదలించి, పితరులఁ బ్రతిబంధించి, వసువులఁ బరిమార్చి, రుద్రులకుపద్రవంబు నాపాదించుచుండెను. అనశ్వరంబగు నైశ్వర్యంబున; నప్రతీపంబగు ప్రతాపంబున నవార్యంబగువీర్యంబున, నవక్రంబగు పరాక్రమంబున నేకాతపత్రంబుగాఁ ద్రిలోకంబు లేలుచుండెను.

అంతఁ గ్రమంబుగఁ దారకునిచేత మునులును, బృందారకులును, ననువుదప్పి, నొచ్చి, యలసిసొలసి, చీకాకునొందిరి. వారంగలార్చుచు, నారడింబొంది, బ్రమసి యుండిరి. ఇంతియకాక, వారు బెగ్గడిల్లి, కకావికలై సొలసి, కులకుల మనికూసి, కుతిలపడియుండిరి. విబుధు లివ్విధంబున వేసరి, యింద్రుండు మున్నుగాఁగ నిటులున్న మాకు దిక్కెట్టు లనుచుఁ బద్మజుని గూర్చి యేగి, హస్తములు మొగిడ్చి, పెద్దమెలుంగున స్తోత్రంబులం జేయుచు మొఱలువెట్టిరి.

"జయ జయ జగన్నాథ! నీవు నిట్టూర్పు విడువ బయల్వెడలు గాడ్పులే నియమపఙ్క్తి. నీకుఁ బ్రణవమంత్రాక్షరంబు భద్రపీఠంబు. నీనిద్రయే విశ్వంబునకు విలయకాలంబును, నీప్రబోధంబు నిఖిలలోకంబులకును నుదయంబును నగుచున్నది. తారకుఁడు మము ...

చేయుచున్నవాఁడు. ఓయాదిపురుషా! తడవుసేయక మమ్ము రక్షింపుము. ఆదుష్టదైత్యునిచే మేము కుక్కలుం బడని పాటులం బడితిమి. గర్భయాచకులభంగి దరిద్రత నట్టుకొనుచు, పాలలోఁ బడిన బల్లులకైవడి లోఁబడితిమి. పలుమాట లికేల? సకలవిధంబులం జెడితిమి. దీనుల మగుమాకు నీ వభయ ప్రదానం బొనర్పుము. దేవా! తారకుం డెవ్విధంబున నాశం బొందును? మాకుఁ బ్రతుకుతెరు వెయ్యది? మాకు దిక్కెది? సంశ్రితజనార్తిహరణపారీణ! కరుణారసార్ద్రహృదయ! మాకు వేవేగఁ దెలియం జెప్పుము.”

ఆదీనవాక్కుల విని హిరణ్యగర్భుండు ప్రసన్నుండై, బృందారకులను, మహర్షులను గనుంగొని యిట్లనియె. “వరప్రభావానుభావంబునఁ వాఁ డింత వాఁ డయ్యెను. విషవృక్షము నైనను వృద్ధిఁబొందించి పెఱకుట తగవుగాదు. పార్వతీపరమేశ్వరుల కుద్భవం బగుసేనానాయకుండు వీనిని మర్దింప సమర్థుండు. పార్వతీదేవియుఁ దండ్రియగుదక్షునిపై రోషావేశంబున యోగనిర్ముక్తదేహయై, హిమభూమిధరగృహంబున నుద్భవించి పెఱుగుచున్నయది. మీ రింక వెఱవకుఁడు. అను వెఱింగి భవునకు నామెను గూర్పుయత్నంబు సేయుఁడు. ఇంతనుండియు మీకు మేలయ్యెడుఁ” బొండని పురందరాదిబృందారకుల వీడుకొల్పి, శతానందుండు యథోచితవ్యాపారంబులం బ్రివర్తిల్లుచుండె. దేవతలును, భావిశుభసూచకంబు లగు గంధవాహాది

ఇంతకుమున్నె దక్షకన్య తండ్రిపై రోషావేశంబున దేహత్యాగ మొనర్చి, యపరజన్మంబున యోషధులకునెల్ల నునికిపట్టగు శైలాధినాథునకును, బితృదేవతలకుఁ గన్నబిడ్డ యైన మేనకాదేవికిని, నబ్ధిచెలికాఁడు మైనాకుఁ డన్నగాఁగఁ బార్వతి యనుపేర నుదయించెను.

ఇట్లుద్భవంబంది, ప్రతిదినప్రవర్ధమానయై, లబ్ధోదయ యగు చంద్రరేఖయుంబోలె బంధుజనంబులకుఁ బ్రమోదంబు నందించుచుండెను. ఆమె మందాకినీసైకతవేదికాస్థలంబుల గం దుకక్రీడ సల్పుచు, నుపదేశకాలంబులఁ విద్యలు నేర్చుచు, బాల్యంబు గడపి, నేత్రోన్మీలనంబు సేసిన చిత్రంబునుంబోలె నలరారుచుండెను. యౌవన విభక్తయగు నాతన్వంగి యభ్యున్న తాంగుష్ఠనఖప్రభావిశేషంబునఁ జరణప్రవాళంబులు రాగంబు వెడలం గ్రక్కుచుండెను. వృత్తానుపూర్వంబులై, నాతిదీర్ఘంబు లగు జంఘాప్రకాండంబులును, వేదండశుండాదండంబులకు వైదండికములోయన నూరువులును నొప్పారుచుండెను. మేఖలా కలాపమధ్యకీలితమహేంద్రనీలమాణిక్యకిరణరేఖయుంబోలె నాభి రంధ్రంబునం బుట్టి రోమరాజియు రాజిల్లుచుండెను. అభినవ శిరీషకుసుమసుకుమారంబులగు బాహువులును, బంధురంబగు కంధరంబును నాచెలువ సోయగంబును వేనోళ్ళఁ జాటుచుండెను. సంపూర్ణపూర్ణిమాచంద్రబింబంబు విడంబించుచు నాననం బును, గావియగు మోవియును, నూబూవువంటి నాసికయును సాదృశ్యం బదృశ్యంబుగాఁ దనరారుచుండెను. నిద్దంపు టద్దము

లకుఁ దోడిముద్దులగు చెక్కులును, సుమకోదండవల్లీమతల్లు లగు కటివంకబొమలును, బొమవిలుతూపుని సుమకోదండమును వెన్నుఁదన్నుచుండెను. విదియనాటి చందురునకుం గదిసిచుట్టం బగు లలాటపట్టంబును, గొదమతుమ్మెదచాలు బురుడింపంజాలు నీలాలకంబులును నొప్పుచుండెను. ఇట్లొక్కొక్క యంగ మెంచు టకుం బదివేలముఖంబులు గావలె. ఈయతివ చందంబుజూడ సర్వోపమాద్రవ్యసముచ్చయంబగు సౌందర్యంబు నేకత్రావ స్థానదిదృక్షచే విరించి సూక్ష్మీకరించి, యథాప్రదేశని వేశితం బుగ నొనర్చెనోయనం దలిదండ్రుల కామె యామోదంబు నాపాదించుచుండెను.

అంతట నొక్కనాఁడు నారదమునీంద్రుఁ డట కేగు దెంచి, యొలమితోఁ బర్వతేశ్వరుని సభలోఁ ద్రిభువన మోహన యగునయ్యుభగమనం జూచి, శుభవచనప్రౌఢి వెల యంగ "భూధరా! మాటలు వేయునేల? సోమకిరీటుండును, సర్వదేవతాధ్యక్షుండునునైన భవుండు మంగళలక్షణలక్ష్మియైన నీతనూజకు భర్తకాఁగలఁడు. నీవు కృతార్థుఁడ వైతి"వనెను. తద్వాక్యంబుల విశ్వసించి, హిమవంతుండు నివృత్తాన్యవరాభి లాషుం డయ్యెను. అమ్యాపారత్నంబును శేషభూషణునకు నీనిశ్చయించియు, నభ్యర్థనాభంగభయంబునం జేసి "నన్నడుగని శివునకుఁ గన్నియ నెట్లిత్తును? అతని కారుణ్యము నాకెన్నడు సిద్ధించునోగద!" యనుచు నన్నగపతి యాత్మందలంచుచుండెను.

# 5. మ ద న సం హా ర ము.



దక్షరోషంబు కారణంబుగా దాక్షాయణి మోక్షంబుఁ జేసినదిమొదలుగా విరూపాక్షుండు సర్వసంగపరిత్యాగంబు గావించి, యపరిగ్రహుండై, హిమశైలపాదంబు జేరెను. నియతిఁ దపము సేయఁగ మదిం దలఁచి, విషయనివృత్తుఁ డగుచుఁ, బ్రమథవర్గంబుతోడ నందు విడిసెను. ప్రమథు లందఱును భూర్జతరుచర్మపరిధానంబుల ధరించి, యప్పర్వతమున, జంద్రకాంతశిలామణిస్థలములందు నమరియున్న నమేరువృక్షములనీడను విడిసిరి.

బసవఁడు హిమవత్ప్రాంతవనంబులం బసరికమేసి, సెలయేరులందుఁ బ్రవహించు తీయనినీరు ద్రావి, మిగులఁగ్రొవ్వి, యుత్సాహధ్వనులు సేయుచునుండ నవ్వనమందలి భద్రగజేంద్రంబులును, మృగేంద్రంబులును గడుభీతిఁజెందెను. తపోవ్రతనియమైకఫలదాత తానయ్యును నయ్యష్టమూర్తి తన మూర్త్యంతరంబైన నగ్నిదేవు నర్చనము చేయుచుండెను.

అంతకుమున్న పురాంతకు రాక యెఱింగి హిమవంతుడనంత సంభ్రమాత్యంతమనోనురాగంబున వాజివరూథదంతి సామంత విలాసినీ స్వజనమంత్రి పురోహిత భృత్యయుక్తుఁడై చనుదెంచెను. అచట పరమేశ్వరునిం గని మహార్హమహార్హహితాలంకృత సర్వాంగుడై వినుతించుచున్న గిరిపతిని గిరిశుఁడు సన్మనమునఁ గారుణ్యాలోకనవార్ధి సుధారసవారినిమగ్నుని

జేసెను. ఇట్లచలాధీశ్వరుం డీశ్వరుకరుణారసార్ద్రిండగుచునుండఁ గొంతకాలంబునకు రుద్రుండు గిరీంద్రున కనేకవరంబు లొసంగిఁ నిజపురంబున కరుగు మని యానతిచ్చెను.

ఆతని వీడిపోవ నోల్లక హిమవంతుండు "హరిసరోజ గర్భామరసన్నుతను లిట్టి నీస్వరూపమును వినికాని యెన్నడును గని యెఱుఁగరు. అట్టి నిన్ను గనియుఁ బాసిపోవఁగానోపుదునే?" అని కరంబులు మొగిచి దీనాననుండై యున్న వాని భక్తియుక్తికిం గరుణించి "సకలలోకాభీష్టఫలవృద్ధి కేదారాత్మకుండ నగుటం గేదారేశ్వరుండన నిప్పురంబున వసియించెదనోడకుండు"మనెను.

దానికిం బ్రసాదంబని, గిరిరాజు "ఈబాల తన్ను దా నెఱిఁగిననాఁటగోలె ననన్యశరణ్యయై యహరహము నిన్ను గొల్చుచుండును. మాపుణ్యమునఁజేసి నీ విందు వచ్చుట విని ముదమున నిన్ను జూడవచ్చెను. నిన్ను జూచినదాదిగ భక్త్యావేశమునఁజేసి మీ పొందు వాయనోపదు. ఇచ్చట దగిన పనులు సేయుచుండుఁ గావునఁ బార్వతియునికికి నీ విచ్చగింపవలయు" నని ప్రార్థించెను.

ఆతని విన్నపమునకు భక్తవత్సలుఁడు నెమ్మనమున సంతసించిన నాక్షితిధరపతి "శివుని బ్రత్యక్షముగాఁ గొలుచు చుండు" మని పుత్రికను నియోగించి, గౌరినందు సురక్షితముగ నునిచి నిజపురంబున కరిగెను.

తనతపోనియతికి రమణిపరిచర్య విఘ్నంబని యెఱిం గియు, మనోవికారరహితుండైన శివుఁడు తపమును, రమణీ

మణినింగూడ నైగైకొనెను. ప్రతిదినంబును హిమధరరాజ తనయ పత్రపుష్పాదులను, గుశపవిత్రంబులను గూడఁబెట్టుచు, నర్ఘ్యోదకములను, నుపకరణములను జేకూర్చుచు, వేదికా సమ్మార్జనవిధి నిర్వర్తించుచు, భవుని పదపద్మములమీఁది భక్తిగలిగి, నిత్యము సేవ లొనర్చుచుండెను.

అక్కాలంబు నం దొక్కనాడు స్వర్గలోకంబునఁ బాక శాసనుఁడు కల్పానోకహంబులనీడలఁ జింతామణివేదికాస్థలంబు లందు బృందారకులు బరివేష్టింపఁ బేరోలగం బుండి, దివిజ కార్యసంసిద్ధిఁ బొందఁ గందర్పునిం దలంచెను. అంతఁ జంద్ర చైత్రు లిరువంకల నొప్పుచుండ రాజకీరరథం బెక్కి, ససంభ్ర మముగ మహేంద్రు నాస్థానమునకు వలరాజు పంచాస్త్రుండై యేతెంచెను. ప్రభువులు ప్రయోజనాపేక్షితులగుచు నాశ్రితుల సముచితగౌరవంబునఁ జూతురుగదా! ఆసహస్రాక్షుని వేయి కన్నులును నొక్కుమ్మడిగాఁ గుసుమబాణుని మీఁదనే వ్రాలి నవి "రా! ఇటురర"మ్మని, చేతికిఁ జేయిచ్చి, సౌహార్దంబున మదనుని సరిగద్దె నుండంజేసెను.

అంత, మహితవినయావనముఁడై హస్తాంబుజంబుల మోడ్చి, దైవతపతితో మన్మథుం డిట్లనియె. దేవా! నన్ను స్మరించుటచే ధన్యుఁడ నయితి. నన్నుఁ దలంప కతం బేమియో యానతిమ్ము. ఘోరతపంబు లొనర్చి, నీపదవి నభిలషించు చున్న వాఁడెవఁడు? శీఘ్రంబ యాన తిమ్ము. ఘోరతపంబు లొనర్చువాని మాన మిదే యడఁచువాఁడ, వాని నిర్జింతుఁ

భంజింతు; నాయట్టిహితుండు నీకుఁ గలుఁగ నీకసాధ్యం బెద్ది యేనిఁ గలుఁగనోపునే? నీవజ్రాయుధము శాంతము నొందు గాక! దేవేంద్ర! నాచెఱకువింటను బూవుల శరములుగ సంధించి, నేన రిపుల నెల్ల నిర్జింతు. నీప్రసాదంబును, మలయా నిలంబుప్రాపును, వసంతంబుసాయంబును నిండువెన్నెల చెలిమియుం గలుఁగఁబినాకపాణియగు హరునైన జయింపంజాలుదు నని తలంతు. తక్కిన వారు నా కెవ్వరు నెనయే?" అని సోత్సాహంబుగఁ బల్కినం బురందరుండు సంకల్పితార్థంబు సఫలం బయ్యెనని యంతరంగంబున సంతసించుచుఁ గంతున కిట్లనియె.

"సంకల్పసంభవుండ వగు నీ కసాధ్యంబగు కార్యం బొకటేనియుం గలదే? నీ వటుల సమకూర్ప సమర్థుండవు. అట్లగుగాక! కావున, ని న్నిపుడు మహాకార్యభరంబున నియోగించుచున్నాము. ధరణిభారధురీణతాప్రౌఢిని శేషునియందుఁ జూచి కాదె తన్ను మోచుటకు హరి వానిని నియమించెను. నీవు విబుధకార్యార్థము విశ్వేశ్వరునిగుఱించి యరుగవలయు. నీ వతిభక్తియుక్తుండవై, కుధరకన్యను శశిమౌళికిం గూర్పవలయు, జలజభవుండునుఁ బార్వతీపరమేశ్వరప్రభవంబైన దివ్య తేజంబు సేనాపత్యంబు వహించి, జయంబుగాంచు" నని చెప్పెను. హిమాద్రిపాదంబున దేవదారువనంబున నియతాత్ముఁడై, పరబ్రహ్మానుసంధానంబు సేయుచు, సంధకారాతి తపం బాచరించుచున్నవాఁడు. పార్వతియు, హిమవన్నియో

గంబున నీశ్వరునకుం బాయక బరిచర్య సేయుచున్నయది. ఈవార్త సకలలోకవృత్తాంతవిజ్ఞానార్థంబు పంపిన యప్సరస్త్రీ వర్గంబువలన వింటి. ఇది కార్యక్రమంబు.

"ఓ బాహుళిక్రమపారీణ! పంచబాణ! ఇది యనన్య సాధారణంబు. ఇంతియకాదు, యవశ్యకరణీయం బిది. కాన నోపరోపకృతిక్రియాభ్యుదయశాలీ! సంకల్పసిద్ధిగాఁగ ని న్నిని వేవేగఁ బూనుము. కార్యమా! ముల్లోకములకు శుభావహము. కృత్యమా యల్పముగాదు. కోరుచున్నవారలా సురులు. ఇట్టి కార్యమును నెరవేర్చ నేకైకవీరుఁడవు నీవుగాక యన్యు లెవ్వరు? హుతాశనునకు సమీరణంబుంబలె మధుమాసంబు నీకు సహాయంబగుగాక! అర్థలాభంబును, సేమంబును, బునర్దర్శనంబు నయ్యెడు"మని దీవించె.

మహోత్సాహంబున దీవనల నంది దేవేంద్రునియాన తి ముత్యాలసేసంబోలె శిరంబున దాల్చి, యైరావణకుంభికుంభాస్ఫాలన కర్కశం బగుకరంబున వాస్తోష్పతి తన్ను గారవించిన, మన్మథుండు మధుసహాయుండై, హిమవత్పర్వతంబు సేరంజనియె అప్పుడు సంయమికోటి తపస్సమాధినిష్ఠకు ప్రతికూలవర్తియయి, షట్పదకోకిలరాజకీరజాలకములతోడఁగూడ ఝషలాంఛను నెచ్చెలికాఁడగు మధుమాసరాజు నవరాగసమంచితపల్లవాస్త్రుఁడై యేతెంచె. అప్పుడు దక్షిణాశాపురంధ్రియు, నుత్తరాభిముఖుడైన యుష్ణరశ్మిచందము నీక్షించి, గంధవాహంబు దీర్ఘదీర్ఘంబుగాఁగ

విరహనిశ్వాసధారను విడిచెను. వసంతజృంభణము సత్వం బొప్ప దీపింప నాసమయంబున భామాకోమలపాదపంకరుహ సంపర్కము నపేక్షింపకయె యశోకపాదప మామూలాగ్రముగ ప్రవాళావళివ్యామిశ్రంబుగఁ బూచెను. మధుమాస కాలం బప్పుడు చిత్తజునకు లేమావిపువ్వులు శరములుగఁ జేసి యం దిచ్చెను.

ఆసమయంబున వనౌకసులగు తాపసులు ప్రతియత్న సంస్తంభితవిక్రియారంభులును, మదనుండు సమారోపితపుష్ప చాపుఁడును, మధుకరంబులు కుసుమపాత్రపరిపూర్ణమధురస గండూషనషుపలాలితప్రియాస్కందోహంబులును, మృగేంద్రం బులు మృగీకండూయమానపరాయణంబులును నై యుండెను. అచ్చరలు హిందోళిరాగంబునఁ బాడుచున్నను నిందుమౌళి పరిసంఖ్యాన మెడలదయ్యెను. నిర్జితేంద్రియులైన ధీరుల నంత రాయము లెటు లెదుర్కొనఁగలవు?

అపుడు వామప్రకోష్ఠార్పిత హైమవేత్రకుండగు నంది కేశ్వరుం డభినవవసంతసమయారంభసంభూతమనోవికారంబు లగు ప్రమథవీరుల భావంబులు భావించి హుంకారంబు సేసి "మానుఁ" డని యదల్చెను. అశిలానందను దివ్యశాసనం బునఁ గాననం బెల్ల నిష్కంపవృక్షంబును, నిభృతద్విరేఫం బును, మూకాండజంబును, శాంతమృగప్రచారంబునై చిత్రార్పి తావస్థానంబునుంబోలె నుండెను. అట్లున్నను, మనోభవుండు ముక్కంటియెదురుఁ జక్కటిఁగాని యొకపక్కియగాఁ బుర

ప్నక్రంబు నడుచువాఁడునుంబోలె మనంబునం జంకుచు నెట్టకేలకు నాజగజెట్టి తపంబు సేయు చలికొండచుట్టుపట్టునకుం జనుదెంచి, చుట్టునుం దిరిగియున్న సురపొన్నమోకల నీడ నిల్చెను.

అచ్చోట శార్దూలచర్మంబునం బర్యంకబంధబంధురిత పూర్వకాయుండును, నుత్తానపాణియుఁ బ్రాణాయామపరుండు నునై శశాంకమౌళి యుండెను. అమ్మహాదేవుని పార్శ్వంబునం బుష్పాంజలి వట్టి ధ్యానావసానావసరముం బ్రతీక్షించుచుఁ గించి ద్విలంబమాన కేసరచ్ఛదాభిరామకాంచీకలాపయుఁ గర్ణికార కుసుమతాటంకయుఁ బల్లవావతంసయు నగుపార్వతిం గనుంగొని యిదియ నాకవసరం బని పంచాస్త్రుం డధిజ్యకోదండుండయ్యెను.

ఆసమయంబున బెనుపాపతలపాగను వలుద కెంజడ కొప్పు వదలిపీడకుండ బిగియఁజుట్టి మిక్కిలి నలుపైన కృష్ణా జినమును ధరించి, భ్రూవికార మెంతమాత్రమును లేకుండుటచేఁ బొడవైన తెప్పలలోని ఘనదృష్టిని నాసికాగ్రమున నిల్పి, నిస్తరంగకమైన మున్నీరుపోలెను, గర్జితములేని ఘనఘనా ఘనముపోలెను ధ్యాననిశ్చలుఁడగు నిందుధరునిఁ జూచి, ప్రసవ నారాచుఁ డతిభయభ్రాంతుఁ డయ్యెను.

దేవతాకార్యమును మదిం దలఁచి, యుగ్రవిలోచనుఁ డున్నప్రాంతమున కొయ్యనఁ జని, కడుభీతిల్లి, తన తియ్యని విల్లు పుష్పనారాచముల శౌర్యసంపదలు వమ్మగాగ వాని నట్టే భూమిం బడవైచెను. అయ్యవసరంబున వనదేవత లెల్లరు దన్నుఁ గొల్చుచుండ స్థావరరాజకన్య యాయిందుకళాధరుని

డాయఁగవచ్చెను. ప్రసూనగుచ్ఛములను దాలిచి లేఁజిగుళ్ళు ధరించివచ్చిన నడదీవవోలె భూమిభృత్తనయ యొయారముగాఁ దరుణేన్దుకిరీటి సన్నిధిని నిల్చెను. అట్లఖిల లక్షణసంపూర్ణమైన లతాతన్విం గాంచి, కుసుమాస్త్రుండు తాఁ బూనిన దేవ కార్యంబు సిద్ధించె నంచు లోలోన సంతసించుచుండెను.

గౌరి భక్తితో నప్పుడు తరుణాబ్జకళాధరుని డాయఁగ వచ్చెను. అయ్యవసరంబున నీశ్వరుండును నంచితయోగసమాధి నిష్ఠమై సముజ్జ్వలకోటితటిత్ప్రకాశమునఁ దేజరిల్లుచుండెను. గౌరి యసమభయభక్తు లొప్పఁ గుసుమాంబుల దోయిట నించి, నడు మసియాడ, మృదుని యడుగులమీఁద గినలయ భంగంబులతోఁగూడ నిచ్చెను. పల్లవపుష్పసముదాయంబుల భవుని పాదసరోరుహాయుగ్మకంబుపైఁ జల్లి, శ్రవోవతంసంబగు సంపగిమొగ్గ యొకింత జారుచుండగా భయభక్తులతో గిరిరాజ కన్య యాతనికి మ్రొక్కెను. "తరుణీ! సరిలేని మగని బడయు" మని శివుఁ డామెను దీవించెను. ఎన్నఁడేని మహా త్ముల వచనంబులు వ్యర్థంబులగునా!

పంచశరుండు తత్పరుండై, బాణవిమోక్షణ కాలముం బ్రతీక్షించుచు, పార్వతీదేవి శంకరునిసన్నిధిఁ జేరినప్పటినుండియు నెప్పు డెప్పు డంచు, వింట నారి సారించుచు నురరీకృతదైవత కార్యధుర్యుఁడై, చెంతనుండెను. ఆసమయంబున మందాకినీ పద్మబీజమాలను దోఃపల్లవమున నతిప్రియంబున గౌరి యుగ్ర విలోచనున కర్పించెను. అయ్యంబుజాక్షి సమర్పించిన యక్ష

మాలను నిటలాక్షుఁ డాదరంబున నందుకొనుచుండఁ బంచ బాణుండు సమ్మోహనాశుగంబును సంధించెను. తోడనే శమ నారాతి నివృత్తధైర్యుఁ డగుచుఁ జంద్రోదయారంభమున బొంగిన దుగ్ధసాగరములీలను సరసప్రేమంబున దనచూడ్కు లను బక్వబింబాధరోష్ఠముఁ గర్ణవిలాసనేత్రము, నతిస్వచ్ఛంబు నగుగౌరిముఖాంభోజమునందు నిల్పెను.

అనంతరం బంతకమథనుం డతర్కితంబైన యింద్రియ క్షోభంబు బలాత్కారంబుగా గుదియించి, చేతోవికారంబు నకుం గారణంబుఁ దెలియం దలంచి, దిశాంచలంబులకుం జూపువఱపె. అప్పుడు కట్టెదుర దక్షిణాపాంగనివిష్టముష్టియు, నానతాంగుఁడును, నాకుంచితసవ్యపాదుండును, జక్రీకృతకార్ము కుండును, బ్రహారోద్యుక్తుండును నై నమన్మథునిం గనుంగొని, తపఃపరామర్శవివృద్ధక్రోధుండయ్యె. అవ్వేళ భ్రూభంగదుష్ప్రే క్షంబగు విరూపాక్షుని లలాటేక్షణంబున జనియించిన సము జ్జ్వలజ్వాలాజాలంబైన కృపీటయోని, భువనంబు లెల్లభయ భ్రాంతంబులై హాహాకారంబులు సేయనమ్మీనకేతను శరశరా సనతూణీరంబులతోడంగూడ భస్మంబు జేసెను.

పంచబాణుండు నిమేషమాత్రంబున నాగభూషణుఫాల నయనానలముచే భస్మంబయ్యెను. యువతిసంసర్గము యోగ మార్గమునకు విఘ్న మని దలచి, యభవుం డంతర్ధాన మయ్యెను. తన కట్టెదుటఁ జెలికాఁడు బూడిదయగుటం గాంచి యా వరచిన ట్లామని యేడ్వదొడంగెను. పార్వతీదేవియు, దన

చారుసౌభాగ్యగౌరవంబు విలువపోయె నని చిన్నవుచ్చుకొని యెను. పర్వతేందుప్రిండు నిర్విణ్ణభావమైన కూర్మినందనను దోడ్కొని యింటికింబోయెను. రతీదేవియు మోహాంధోన్మీలితంబులైన లోచనంబుల నత్యంతప్రియదర్శనుం డగుప్రియునిం గానక పురుషాకారంబున భూమింబడియున్న భస్మంబుం గని ప్రలాపింపందొడంగెను.

"చక్రనివారిలోను నెఱజాణలలోను, విటరాజికోటిలోను బ్రసిద్ధివహించిన నీవు ప్రాణములం గోల్పోవ నీయెదుట నే మిసిమింతురాలుగానైతినిగదా? నీవలన నా కెన్నండేని ప్రతికూలాచరితంబు జరిగియుండెనా? నావలన నల్పంబైన ప్రతికూలాచరితంబు నీవు గనియుంటివా? ఓలక్ష్మీపుత్ర! అతి దుఃఖాన్వితనగు న న్నీ యధ్వాన్నంబునం ద్రోసిపోవంజనునా?"

"నేను నీహృదయంబున నుండి ప్రియముం జెప్పెద ననెడిమాట భేషజంబుగాదా! నాహృదయంబున నుండుటే నిజమైన, మదన! నీ వెట్లు భస్మమైతివి? నీవు భస్మము కాఁగా నేను బ్రతుకుట యెట్లు? మన్మథ! మధురాలాప నిసర్గపండితంబులగు గండుంగోయిలల నే లోకో భువనంబులకు రాయబారంబులు పంపవు? ప్రణిపాతయాచితంబులగు గాఢోపగూహనంబులు మఱచితే? ఆర్తవంబగు కుసుమప్రసాధనంబు నాయంగంబులం దిది నీవురచియించినదికాదా! దక్షిణేతరంబగు మదీయచరణంబు లాక్షారాగపరికర్మంబునకుం దగదొకో? పతంగమార్గంబున సింగలంబునం బడి భవదంకం బాశ్రయిం

చెదగాక! మదనుండులేక రతీదేవి జీవించె నను నపవాదంబు నోర్వవచ్చునే? నీనెచ్చెలి వసంతుం డెచ్చటనున్నవాఁడు? పటు క్రోధ రేఖానటద్రుద్రాభ్రభంగభీషణుండగులలాటలోచనులోచనంబు చిచ్చున నతండును నిన్నుఁ గూడెనే!" యని యనేకప్రకారం బులఁ బలవింప నాపలుకులు బాణపాతంబులంబోలి తూఱ నాటుటయు నెంతయు నొచ్చి, యమ్మాధవమాసం బక్కలయ కోమలకుం బుట్టిన మహావ్యసనం బూరార్పం జేరవచ్చెను.

ఇవ్విధంబున నారామ పేరామనిమెదుట నెమ్మనంబునఁ బేరామనియై వర్తిల్లి సొమ్మసిలంబోయి, లేచి, వసంతునిం గనుంగొని, "మాధవ! నీచెలికానిం జూడు; కపోతకర్బురం బైన భస్మంబైనవాడు. సురాసురంబైన జగంబు బిసతంతు గుణంబైన కోదండంబునం గలగుండ్లువెట్టునట్టి జగజెట్టియుం గలఁడే? అతిపరుషపవనసంపాతాహతంబైన దీపంబునుంబోలె నీపరమమిత్రుండు క్రమ్మఱిలండుసుమీ! నాపాపంబునం జేసి విధి వెలిగాఁ గొన్నన విలుకానిం గొంపోయె. నీవును బరమ మిత్రుండవు గావున నన్నును నగ్నిముఖంబున నీసఖుంగూర్చి నీకుం బాడియగు. 'శశితోడంగూడఁ గౌముదియు; మేఘంబు తోడంగూడ మెఱుంగు' ననుట సకలసమ్మతంబు. కుసుమశరు భసితచూర్ణంబు శరీరంబునం దాల్చి, నామేను విభావసునందు వేల్చెద. కిసలయతల్పంబులకు నిటమున్ను సహాయుండ వగు నీకుఁ జితి పేర్పందగు" ననిపల్కుచు శోకావేశంబున వెండియు, "తమ్ముఁడా! హస్తయుగ్మము మోడ్చి నిన్ను బ్రార్థించెదను.

నాకు దగునట్లుగాఁ జితాగ్ని నిమ్ము. మలయానిలంబును మంద మందంబుగా వీచుచు నాచితిని మండించుగాక! పరలోక తృప్తి కొఱకు సహకారమంజరీచగుపిండ కబళంబు పెట్టి, ధర్మోదకము నిమ్ము. నన్నును నీప్రియమిత్రుండగు వలరాజునుం దలంచి, యుత్తరక్రియలను జరిపింపు" మనుచు, తెంపు సేసి యగ్ని ప్రవేశంబున కాయిత్తంబయ్యెను.

ఆసమయంబున రతీదేవి నుద్దేశించి, యాకాశవాణి "ఓమన్మథపత్ని! సాహసంబు వల దుడుగుము. నీకుం జేరు వన మేలుగాఁగలయది. పరమేశ్వరుఁ డద్రితనూజను బెండ్లి యాడి, లబ్ధసౌఖ్యుండయి, నయ్యంబిక ప్రార్థింపఁ బ్రియంబున నీప్రియుని నీ కొసంగును. కావున నొండుతలంపకుము; దీని నమ్మియుండు"మంచునదృశ్యమయ్యె. ఈయదృశ్యరూపంబైన భూతంబు రతీదేవి మరణవ్యవసాయబుద్ధిని మందీభవింపఁ జేసె. కుసుమాయుధబంధుండగు వసంతుండును నావృత్తాంతంబు నకు సంతసించి, యక్కాంత నూరార్చెను. ఆశాపాశం బవలం బించి శంబరారిపత్నియు, గౌరీకల్యాణకాలమ్మం బ్రతీక్షిం చుచు, విరహాక్షీణంబైన శరీరంబును రక్షించుకొనుచుండెను.

---

## 6. గౌరితపస్సు.

నిర్విణ్ణభావయై గౌరీదేవి హిమవద్గృహంబుఁ జేరి తన కట్టెదుటఁ దనకుగా నీశ్వరునిచే దగ్ధంబైన సుమశరుని గాంచి, పార్వతీదేవి తనసౌందర్యమును నిందించుకొనెను. "పరుల మెప్పు వడయని నాచెలువము నిష్ఫలముగదా!" యంచు గౌరి విలపింపఁ దొడఁగెను. అనంతరంబ వసుంధరాధరకన్య యవంధ్యప్రతిజ్ఞయై తపస్సమాధినియమత్వము వహింప నిజాభిప్రాయంబు మేనాదేవి కెఱింగించెను. అంత మేనాదేవి పుత్రికను గౌఁగిలించుకొని, చతురభంగి బుజ్జగించి, పెక్కుహితోక్తులఁ దనయ నాయుద్యమమునుండి మఱలింప యత్నించెను. "ఈపర్వతప్రదేశమున వేల్పు లున్నవారు. నీ వెక్కడ? ఘోరవీరతప మెక్కడ? శిరీషపుష్పము మధువ్రతమును సహింపంజాలుగాని, విహగ మెక్కిన నోర్వనోపునే? శిరీషపేశలంబగు నీసుకుమారశరీరము తపఃక్లేశంబును సహింపఁగల్గునా?" యని మేన మఱల్పంబూనినను బార్వతి తల్లిమాటఁ జేపట్ట దయ్యె. ఇది సహజంబు; యీప్సితార్థంబునకు జారుహృదయంబును, బల్లమునకుఁ బ్రవహించు బ్రవాహమును నాపనేరికైన శక్యంబగునా?

పిదప నాచంద్రానన సఖీముఖంబున నిజమనోరథంబుఁ దండ్రి కెఱింగించి, యమ్మహానుభావుచేత నరణ్యానివాసమునకును, ఫలోదయాంతంబైన తపస్సమాధికిని నానతివడసి, దృఢప్రతిజ్ఞానిర్వాహంబునకుం గడంగె. అంత, మణిభూషణాద్య

లంకారంబులఁ దిగఁద్రోసి, యీశ్వరారాధనకౌతుకయై మహీధగ వల్కలంబులను భూధరరాజకన్యక ధరించెను. ఆమె పాశుపత దివ్యదీక్షను జేపట్ట క్రమంబునఁ గుంతలంబులు మడమల నంటు నిడుపాటి జడలు గట్టెను. పర్వతరాజతనయ మునీశ్వరులకుఁగూడ కఠోరమగు తపశ్చర్యను బూనెను. అంత నొక్కనాడజినాషాఢధరుండును, ప్రౌఢతరభాషాతిప్రగల్భుండును, నీరజబంధుప్రతిమాన తేజుఁడును, జటారాజిచ్ఛటాతామ్రమూర్ధజుఁడును, నేకాకియునైన బ్రాహ్మణవటుండు వనాంతంబుననున్న యాత్రిజగన్మోహనమూర్తిసన్నిధికి నేతెంచెను. అతఁ డామె యెదుట నిలిచి యామె నాశీర్వదించెను. పార్వతియు బహుమానపురస్సరంబుగా నయ్యుర్వీసురవటునకు నతిథిపూజ యొనర్చెను. అతండును గొండరాచూలి సేయు సత్కారంబంగీకరించి, ముహూర్తమాత్రంబు విశ్రమించి, మేలుపడినచూపునం జూచి ప్రస్తావోచితంబుగా నిట్లనియె.

"అంభోజపత్త్రాయతాక్షీ! సలిలంబు స్నానక్షమంబై యున్నదా? సుందరాంగీ! కుసుమంబులును, నిధ్మంబులును సులభలభ్యంబు లగునా? ఓ చంద్రవదనా! సత్త్వంబులు జాతివైరమును బోనాడి శాంతత మెసలుచుండునా? పూఁబోణీ! దేహయాత్రకు నీవారాదు లాయితంబు లగునా? ఫలముపై నాశను విడనాడి, శక్తికొలఁది తపస్సుఁ జేయుచుందువా? ఇంతకును, ధర్మసాధనములందు నాద్యమగు సాధనంబు దేహంబు గదా! కన్యారత్నమా! నీవు పెంచిన లతాదులు నీపగడంపుఁ

గళమ్మోపై నుదయించు నగవునుంబోలె చిగుర్చుచున్న హా! అభ్రవీథినుండి జారినయట్టి యమరతటినీప్రవాహమ్ముకంటె నీసుచరిత్రంబునగాదె ధరణీధరరాజు పావనమూర్తియయ్యెను. బ్రాహ్మణజాతిస్వభావసులభంబైన చాపలంబున నొక్కమాట యడిగెద. సంబంధంబు సాప్తపదీనంబుగావున నింతతడవు నీతోడఁ గదిసి పలుకు చునికింజేసి యేనాప్తుండను. కావున, రహస్యంబుగాకుండెనేని దానిని జెప్పుము.”

“అబల ! నీవు ప్రథమప్రజానాథ పావనకులంబున నుద్భవించితివి. నీవు సౌందర్యసంపద నడినన్నదానవు; ఐశ్వర్యసంపదలఁ దులఁదూగుచుంటివి; సర్వసామగ్రియు నీయఱచేతిభాగ్యము; నీవు కోరఁదగిన దేమికలదు? నీమనోరథం బేమి చెప్పుమా ? శరీరమును గృశింపఁజేసి దుష్కరంబైన తపంబు జేయుచుంటి విదేల ? నీచిత్తమును విచారమార్గంబునఁ బెట్టుటకు హేతు వెయ్యది; తెలియఁజెప్పుమా? నీకుఁ బితృగేహంబున నవమానంబు పుట్టదుగదా! పన్నగఫణారత్నంబుమీఁద జెయిసాచువాఁడునుం గలఁడె! నిందుజవ్వనంబునకుం దగిన విభూషణంబు దిగఁద్రావి, వార్ధకోచితంబులగు వల్కలంబు లెట్టులు ధరించితివి? దేవలోకంబున కానపడెదేని, నిది వృథా శ్రమంబుగాదె! నీపుట్టినిల్లు దేవభూమియకదా! తగినవరునింగామించి, సమాధి వహించితివేని నదియు నీకుఁ దగదు. ఎప్పుడైనను రత్నం బొరునిచే నన్వేషింపంబడునుగాని తా నొరు నన్వేషించునే ? నీనిట్టూర్పుగాడ్పులచే దుర్లభజనాను

రాగంబు నీయందుఁ దేటపడుచున్నయది. అట్టి కఠినహృద యుం డెవ్వఁ డొకో! వాని నపేక్షించి, నీవు కలమాగ్రి పింగళంబగు జటాభారంబు ధరియించితేని నయ్యది నీకుఁ దగ" దని, యంత నిలువక, యక్కపటవటుండు వెండియు నిట్లనియె.

"తరళేక్షణ! నేనును బ్రహ్మచారిని; నీవును గన్యవు. సమ్మానముతోడ నన్ను వివాహమాగమ్ము; లెమ్ము. అటుల కాదేని, నాతపములోని సగము నీ కొసంగెదను. నీతపోభి మానము నింక మానుము" మనెను. అంతఁ బార్వతియు నమ్మిథ్యా వటునకుం దనమనోరథం బెఱిగింప నోల్లక వయస్యం గనుసన్న చేసిన నచ్చెలికత్తెయు నత్తపోధనకుమారునితో నిట్లనియె.

"అయ్యా! నీకుఁ గుతూహలంబుగలదేని వినుము. కాలకంఠకఠోరకహుంకారకవలిత వర్తకంబగు పుష్పచాపుని సమ్మోహనాస్త్రం బీకన్య హృదయంబున గాఢంబుగా నాటి యున్నది. నాటంగోలె లలాటచందనధూసరాలకయై, తుహిన సంఘాతశిలాతలంబగు జనకునింట ధృతిం జెందకున్నది. మహేంద్రప్రభృతులగు దిగీశుల నుజ్జగించి, యీసుందరాంగి పినాకపాణిం బతిగాఁగోరి తపంబు సేయ నమకట్టెను. సబాష్ప కంఠస్ఖలితంబులగు సంగీతాక్షరంబుల విరూపాక్షుచరిత్రంబు పాడుచు వనాంతసఖులగు కిన్నరరాజకన్యకల వగపించుచున్న యది. త్రిభాగశేషంబులగు నిశానమయంబుల నించుకించుక నిద్రించుచుఁ గలగాంచి, 'నీలకంఠ! ఎచ్చోటికిం జనియెద' వని యసత్యకంఠార్పితబాహుబంధనయయ్యును, విరహవ్యథాదుస్స

హంబగు తపోభారంబున భర్గువశీకరింపం దలంచియున్నయది"
యని పల్కెను.

అంత నక్కపటవిప్రకుమారుండు వికవిక నవ్వి, "తరళాయతాక్షి! మీ నకియ వానికై మనమున ననురాగబంధము నిల్పెనఁట! ఇది యేమివింత! వివాహసమయంబునఁ బురశాసను పాణిఁ బరిగ్రహించుచుండ వానిమొగమున వ్రేలుచున్న యహిం బుస్సు మన మీనకియ యెంతభీతి నొందునో! నీరాయంచ యంచుఁ జీరకుఁ బచ్చియేనిక తోలుబచ్చడము సోకునుగదా! అహహా! ముదిగొడ్డు నెక్కి భిక్షాటనంబుసేయు వరుని జూచి లోకంబు లెల్ల నవ్వరే! ఇంతకాలంబు దపం బాచరించిన దీవరునకా? ఏమివింత? వానిపుట్టుక యెఱుంగరానిది. వీని మూఁడవకన్నుఁ జూడ సరిబోలు వా రెవ్వరును జగంబున లేరు. వెఱ్ఱివాఁ డయినను జేపట్టఁడుగదే! జంతుకోటికి వీఁడు ప్రాణహరుం డఁట! తాను కట్టిన తోలుచీరయే వానికల్మి నంతను ప్రకాశము సేయుచున్నది. ఎవ్విధంబునఁ జూచినను శివునిబైసి యెఱుంగరానిది. సరోజపత్రాయతాక్షి! పలుమాటలికేల? హరునిగూర్చి తపంబింకఁ జాలింపుము. ఎచ్చట నేని పాటిన వాడికొట్టు యూపసత్రిక్కయు కర్హమైయుండునా? నీవే చెప్పుము." ఇట్లనిన నక్కపట వటునకు నవ్వధూటి యిట్లనియె.

"నీతోడి వివాదము లింక చాలు. నీవాలముచేసి శంభుని గూర్చి యిట్లు పల్కితివి. అటులేయగుఁగాక! కానిమ్ము; వినుము. నామనం బెంతయుఁ జంద్రమఃకళామౌళిపయిం జిక్కె.

ఇఁక నా భుజంగవిభూషణునిం దొరంగగ నేఁ జాలుదునయ్యా" అని జయావిజయలం గనుంగొని, యపాంగంబులఁ గెంపుగదుర "నీబ్రహ్మచారి శంకరునిగురించి యింకను వంకరకొంకర మూటలాడ నుంకించుచున్నవాఁడు. ఇతని మెడ వట్టి నూకుం" డని పల్కెను. అంత జిలుగగు వల్కలాంచలము చెన్నుమీఱ జాఱుచుండఁ గోపావేశంబున మోమడ్డంబు ద్రిప్పి, తుషారశైలసుత నాలుగేను పదంబులమేరసని, భ్రూకుటీకుటిలముగ్ధలలాటము ఖేందుబింబమై మఱలి, భుజగమండనుం డగు నక్కపటద్విజోత్తముని గనుంగొనెను.

అంత శూలిసాక్షాత్కారముజెంది నవ్వుచు "నరుదగు నీతపమునకు నమ్ముడుపోయితిని. నన్నేలుకొనుము." అనుచు ప్రియవాక్యంబుల గారవింపఁగా ధరణీధరేంద్రనందన తన తపోవేదనాభరం బంతయుఁ బోనాడి, పరితోషం బంది, వ్రీడాప్రమోదక్షమాదాక్షిణ్యంబులు సందడింప నీశ్వరుని సన్నిధానంబున నిలిచెను. పిదప గిరిరాజనందన "మాతండ్రి హిమవత్పర్వతేంద్రుండు దేవరకుఁ బ్రమాణీకరింపం బాత్రం బయ్యెడను. కన్యకను, పితృపరాధీనను నగుటచే దేవరచిత్తంబున నవధరింపవలయు"నని విన్నపము సేసెను. అమృతకరమౌళి 'యవు' నంచు బలికి, గిరిరాజనందనను జయవిజయలను ప్రాణసఖులతోడం గూడ నంపకము వెట్టెను.



# 7. పార్వతీపరిణయము



గిరిరాజనందన నంపకము వెట్టిన పిదప మదనాంతకుఁడు సప్తమునుల నరుంధతీసహితంబుగఁ దనచిత్తంబునఁ దలంచెను. భాసందోహము సూర్యచంద్రకాంతుల భంజింపుచుండ నా సప్తర్షు లరుంధతీసహితులై యాకాశమార్గమునుండి దిగి, కైలాసముం జేరి, హేమపీఠాసనుండై దేవతల్గొలువఁ గొలువున్న శ్రీకంఠుని జూచిరి. ఈశ్వరుండును బదియార్వన్నె పసిండి వల్కలములందు భాసిల్లు ముత్యాలజన్నిదములం ధరించి, తన కట్టెదుర నిలచిన సంయమీంద్రుల సంభావనపూర్వకంబుగా సంవీక్షించెను. కందర్పశాసనుం డంతఁ బతిపదంబులపై భక్తితో దృష్టినిలిపిన దివ్యచరిత నరుంధతీదేవిం జూచి, సమ్మదము నొందెను. గౌరవముతో స్త్రీపుంవిభేదంబులేక యరుంధతీదేవిని శివుఁ డాదరించెను. మహాత్ములకుఁ బుణ్యకర్మం బే మాననీయంబుగాని స్త్రీపుం విభేదం బిసుమంతయుఁ గాదు కదా! ఆఋషులను జూడఁగ శివునకు దారపరిగ్రహముపై నెంతయు మనంబు దగిలియుండెను. అట్లేయగుగాక! అరయఁగా సారపుధర్మంబులఁ కెల్ల దారపరిగ్రహంబే సాధనంబుగదా!

అప్పుడు సప్తర్షులు హర్షవినయభక్తిశ్రద్ధాదివిశ్వాస తాత్పర్యంబులు మనంబునం బెనఁగొనఁ గేలుదోయి మొగిచి, ఫాలభాగంబునం గీలించి, "దేవా! ఇంతకాలంబునకుంగదా మాతపోధ్యానాధ్యయనయజ్ఞవ్రతాదిధర్మంబులు ఫలియించె.

భువనాధ్యక్షుండవైన నీవు మనోరథాగోచరంబైన మన్ననం జేసి మనోవిషయంబున మన్నించితి వింతకంటెను మాకు భాగ్యంబుగలదే? ఎవ్వానిచిత్తంబున నీవు వర్తింతువో వాఁడుకదా కృతార్థుండు నీచిత్తంబున వర్తించు మాకృతార్థత్వంబు వేఱె వర్ణింపనేల? యుష్మదనుధ్యానసంభవంబగు ప్రమోదభారంబు మాయంతరంగంబులయం దంగీరించుటకు సకలభూతాంతర్యామి వగునీవ ప్రమాణంబు. మాటలు వేయు నేటికి? చిందితోపస్థితులమైన మమ్ము నేవనివంపునఁ దలంచితివో యాన తిమ్మంచు ముకుళితకరులై నిలిచిరి.

తొలకరిమేఘఘోషంబులతో సరివచ్చు ధ్వనితో లలాటలోచనుండు మునివ్రజంబుతోఁ బ్రస్ఫుటంబగు వాక్కున నిట్లనియె! "తృష్ణాతురులైనవారు వారివాహంబును ఘనవృష్టిం గోరునట్లు సేనానిమిత్తము మత్ప్రసూతిని వేల్పులెల్లరును గోరిరి. ఏతదర్థంబ పార్వతిని ధర్మపత్నిగా నపేక్షించువాఁడను. మాకొఱకు మీరు హిమాచలంబునకుం బోయి, యిక్కార్యంబు సంఘటింపవలయు. యుష్మత్సంఘటితంబులైన సంబంధముల కెన్నఁడును వికారంబు పుట్టనేరదు. అభ్యున్నతుండును, స్థితిమంతుండును, వసుంధరాభారధూర్వహుండును నగు నద్ధరాధరసార్వభౌముండు మనకు సంబంధబాంధవార్హుండు. కన్యార్థంబ యిటు వర్తింపుఁడు. భగవత్ప్రణీహితంబులైన పురాణాగమాదులుగదా లోకవ్యవహారంబులకు నిదర్శనములైయుండును? ఈయరుంధతీదేవియుఁ బురంధ్రీజనంబులకు జనవుచెల్లును.

ఇది శుభముహూర్తం బిప్పుడ కదలి, యోషధిప్రస్థపురంబు నకుం జనుండు. కైలాససానుప్రదేశంబులఁ బునస్సమాగమం బగుగాత'' మని శంభుండు విస్రంభగంభీరంబుగా నానతిచ్చెను.

సమస్తసంయమి జనాద్యుండగు నాతండు శైలసుతా పరిగ్రహోద్యతుఁ డగుటచే సురమహర్షివరేణ్యులు మున్నగు వారు పరిగ్రహాకరంబగు లజ్జను విడనాడిరి. శివు నానతిని 'మహా ప్రసాదం' బని యంబరమార్గంబున వారు హిమవంతంబు డాయంజనిరి. నిర్మలమైన నిధిలోన గాన్పించు నిండుబింబముల పోలిక నంబరమార్గమునుండి దిగి, హిమవత్పర్వతప్రాంతస్థలం బుల నాఋషిగణంబు వెలుంగఁజొచ్చెను. హిమవంతుం డంత నర్ఘ్యాదుల చేతంబూని, తనపాదన్యాసంబులతో ధరిత్రి కంపం బొందున ట్లడుగులిడుచు, నత్యంతసంతోషం బందెను. అంభో దాకారముతోడ దిగిన మహాపుణ్యాత్ములును, సర్వలోకాది శ్రేష్ఠులును నగు దేవసంయమివరేణ్యుల నెదుర్కొన భయ భక్తులు మనంబునఁ దొట్రిలఁగ నాతఁడు వేగమె యేతెంచెను. ధాతుతామ్రాధరుండును, దేవదారుభుజుఁడును, సానువక్షస్థలుం డును, వటస్కంధుండును నగుమంచు గుబ్బలిరాజు సంభ్రమము తోడ వారి నతిభక్తి నెదుర్కొనెను. విధిమార్గ మిసుమంతయు వీసరవోవకుండ హిమవంతుండు వారల కర్ఘ్యపాద్యాదు లొనర్చి, వినిర్మలాచారసంపన్నులగు నమ్మహర్షివరేణ్యుల సాదరంబుగ నంతఃపురానకుఁ దోడ్కొనిపోయెను. అచట వారల నుచితాస నంబులఁ గూర్చుండఁజేసి. సాంగతకుశలవార్తానుపహారంకముగ

వినయావనతపూర్వకాయుండగుచుఁ గేల్దోయి మొగిడ్చి యమ్మేరుసఖుం డిట్లనియె.

"పుణ్యనిధులార! తలవని తలంపుగా మీరు నాగృహంబున కరుదెంచుట జూడ నపపయోదసముద్భవంబైన వానయు ననధిగతపుష్పజాలకంబునైన ఫలంబునుంబోలెఁ గన్పట్టుచున్న యది. ఓమునులారా! మీపవిత్రాంఘ్రులు నన్నంటుటయు మదీయమూర్ధము వెంట నభ్రగంగ వెల్లివిరియుటయు నను నీ రెంటను నేను బావనుండ నైతిని. మీపాదస్పర్శచే నామేను పావనత్వమును బొందెను. మిమ్ముఁ గన్నులారఁ గాంచుటచే నాజన్మ కృతార్థతం బొందెను. మీకృపాసముద్భవసంతోషంబుతో నా నెమ్మనము నిండెను. మీరలు నన్ను గృతార్థుని జేయుటకును, బరమపుణ్యుని జేయుటకును, సంపన్నుని గావించుటకును నేతెంచిరి. కావున, మీవచ్చిన కార్యక్రమంబు నానతిండు."

ఇట్లు శీతాచలేంద్రుండు పర్జన్యకఠోరగంభీరనిస్వనముతోఁ బల్కిన నందంద ప్రతిధ్వనులు చెలరేఁగఁగా మునిశ్రేణికి నిన్ను మారు పల్కినరీతిని దోఁచెను. అప్పు డంగిరసుం డందరిమునీంద్రుల యనుమతి నపర్వతేంద్రున కిట్లనియె. "ఉర్వీధరసార్వభౌమ! నీసర్వమును సంపన్నంబగు, నీదుహృదయం బఖర్వములగు నీమహాశిఖరంబులంబోలె సర్వోన్నతంబుగాదే! చరాచర భూతజాలంబులకు నాధారుండవగు నిన్నుం బురాణవిదులు [illegible] పాతాళగగనగోళమూలాధారంబ

వగునీవు భూభవనంబు భరియింపనినాఁడు భుజంగమశేఖరుండు మృణాళపేశలంబగు ఫణామండలంబున నిడి భరింప సమర్థుం డగునే? సత్పావనంబులును, నా సేతుసముద్రావనీచిహ్నంబులు నగు నీసలిలప్రవాహంబులు భవత్కీర్తి తీర్థంబులంబోలి భువన పావనంబులు, తిర్యగూర్ధ్వాధరస్థానంబు లాక్రమించి త్రివిక్ర మావతారంబున విరాడ్రూపంబు వహించిన విష్ణుకైన ననుక రించెదవు. నీకు నితర పర్వతంబులకును సాటియే? ఇది యట్లుండ నిమ్ము. మేము వచ్చినకార్యంబు సావధానుండ వయి యాకర్ణింపుము.

"ఏవేల్పులకును లేనట్టి యీశ్వరశబ్దంబును, సుధాధాము తోడఁ దాల్చువాఁడును; జగమునంతటను బ్రధానాంగముల నన్నిటను సంచరించువాఁడును, యోగీశ్వరేశ్వరు లేకతంబున నుండి యోగదృష్టిఁ గాంచ యత్నించువాఁడును, బుధేంద్రు లెవ్వనిపదము పునరావృత్తిశూన్యకమని తెల్పుదురో యట్టి వాఁడును నగు శంభుండు, విశ్వలోకైకసాక్షి నీయనుఁగుఁగూఁతు నడుగవచ్చినాడు. మేము పెండిలిపెద్దలము; నీవు భాగ్యవంతుండ వైతివి. త్రిలోకంబులకుఁ జంద్రకళాధరుండు తండ్రి; నీయనుంగు గూఁతు రింక తల్లి యగుఁగాక! దేవతానిచయంబులు హరునకు మ్రొక్కి, పిదప నీపుత్రికకు మ్రొక్కుదురుగాక! ఈమె నిచ్చి, హితబాంధవం బొనర్చుటచే నీ వఖిలపతికి గురుండ వగుదువు. ఈరాజబింబాస్యమూలమున నీ యద్రికులంబునకు దేవకులం బుతో బంధుత్వ మేర్పడుఁ గాక! తల్లిదండ్రులకుఁ దగినవరునకుఁ

గన్యకాదాన మొనర్చుటకంటె వేఱపుణ్యంబు గలదే! నీవు దాతవఁట, మేము సంఘాతలమఁట; గారవంపుఁ బెండ్లికూఁతురు గౌరియఁట; పెండ్లికొడుకు శంభుండఁట. ఓ పర్వతాగ్రగణ్యా! సంప్రదాయంబు స్తుతింపఁ దగిన"దని తీయందనపుఁ బలుకులఁ బల్కెను.

బహుప్రకారంబుల మధురవాక్కుల దేవర్షి పల్కుచుండఁ దండ్రిపార్శ్వమున లజ్జాభరంబును, మాధుర్యంబును దోప నల్లనల్లన నవలీలాపద్మపత్రంబుల నమ్రవదనాంభోజాతయై, గౌరి లెక్కించుచుండెను. భూధరరాజు సంపూర్ణకాముండై, తనకను జూచెను. కన్యకాదానవేళల పుడమియందు గృహస్థుల కంటె సద్దేహినులకుఁ జనవుగలదు. అనంతరంబ, తనకూర్మి కవ్యం జూచి, "సర్వజగచ్ఛరణ్యుండగు నమృతాంసుమౌళికి నీవు భిక్షువ వైతివి. ఆదిమబ్రహ్మలును, ఘనపుణ్యరాసులునగు గగనమును లర్థించవచ్చినవారు. అల్లదే! పరమపతివ్రతాపరిష చ్ఛిరోమణియగు నరుంధతీదేవి. త్రిలోకైకపినుత వగు నీమూల మున నాభాగ్యము పండి గృహమేధిఫలము నాకు సిద్ధించె" ననుచు హిమవంతుండు దనకూర్మినందనచే ఋషులకు నందఱ కును మొక్కించెను. వారును నీప్సితార్థక్రియాసము పేతుఁడైన శైలపతిమాటలకు సంతసిల్లి గౌరి నాశీర్వదించిరి.

కుతూహల యగు నాహంసగమన నరుంధతి తనతొడల మీఁదఁ గూర్చుండఁ బెట్టుకొనియె. మునులును వినిశ్చిత కార్యులై నాఁటికి నాలవనాఁడు ముహూర్తనిశ్చయంబు నేసిరి.

అంత సారుంధతీకులై హిమాద్రి నామంత్రించి చని, విశుద్ధం బైన కార్యార్థంబు విన్నవించి, యమ్మహాదేవుం డనువ మునులు నిజస్థానంబుల కరిగిరి. పశుపతియు నెట్టకేలకు దివసత్రయంబు గడుపుచుండెను.

అట నోషధిప్రస్థపురంబునం దోషధీనాథుఁ డభివృద్ధి నొంద, బర్వతేంద్రుండు బంధుయుతుండై పుత్రికోద్వాహంబు నకుఁ దొడంగెను. అపుడు నవశుభారంభ సంవిధానములతో సానుమంతుని పురం బంతయు నొక్కయిలువోలె సంభ్రమ ములో నొప్పుచుండెను. అంత, సుమగుచ్ఛమాలికలతోను, గాంచన తోరణావళులతోను, బుకవీథుల నలంకరింప నోషధి ప్రస్థపురం బఖిలలోకవిలోచనహర్షకరమును, రాజితంబును నయ్యెను. పుత్రవతులగు ముత్తైదువు లమ్మృత్తకాశినికి శృంగా రంబు సేయంబూనిరి. బంగారు కంకపత్రమును గెంగేలధరించి, యభ్యంగనానంతరము భాస్కరకరసంగతయగు విదియనాఁటి శశికళంబోలె గిరినందన యొప్పుచుండెను.

అప్పుడు మంగళస్నానవిశుద్ధగాత్రియు, గృహీతప్రద్యు ద్గమనీయయునై ప్రఫుల్లకాశయగు శరత్కాల వసుంధరయుంబోని పార్వతిం దత్ప్రదేశంబులనుండి మణిస్తంభచతుష్టయాభిరామం బగు కౌతుకవేదిమధ్యంబునకుం దెచ్చి, నెచ్చెలు లలంకరింపఁ దొడంగిరి. అంత చక్రవాకపదాంకితసైకతముల మిక్కిలి విల సిల్లు నాకాశగంగవోలె గోరోచనాపత్రకములతోడ నీహారగిరి తనూజ విలసిల్లెను. తుమ్మెదలతోఁగూడిన పద్మముంబోలెను,

జలద రేఖాయుతంబైన చంద్రుని పగిదిని, ఫాలమునఁ గుంతలంబు నేర్పఱుప గిరికన్య నెమ్మొగంబు నెలవుగాఁ దోఁచె.

కుసుమంబులతోఁడ లతయును, నక్షత్రగ్రహతారకంబులతోఁడ రాత్రియును, కలహంససందోహంబుతోఁడ మందాకినియుంబోలె దివ్యాభరణంబులతోఁడంగూడి పార్వతి సర్వలోక నయనోత్సవకారిణి యయ్యెను. పిమ్మట మేనకాదేవి ముద్దుగన్నియ మోమెత్తి కల్యాణతిలకరేఖ తీర్చి రచియించెను. అపుడు నవఫేనపుంజియగు నాసరోరుహాక్షి కులదేవతలకు మ్రొక్కి, ముత్తైదువుల కభివాదనంబు సేసి, కల్యాణమండపంబునం దఖిలపరివారపరివృతయై సింహాసనంబుమీఁదం గూర్చుండి మహోక్షలాంఛను నాగమనంబుఁ బ్రతీక్షించుచుండెను.

పెండ్లిగూడఁబోవు సమయంబున దివ్యశృంగారంబు నవదరింప దేవదేవుఁడును సమ్మోదవాహపహిల్ల నాదరించెను. గంగాధరుండు సమాసన్నగణానీతంబైన ఖడ్గంబున నీడఁజూచి, నంది భుజావలంబియై, శార్దూలచర్మవిహితవృషభంబును గైలాస శిఖరంబుంబోలె నారోహణంబు సేసెను. బ్రహ్మ మొదలైనవారు బరివేష్టించియుండ మంగళతూర్యనాదంబులు మ్రోయుంపం ద్వాత్రింశత్కోటి దేవతాసమూహంబులు గొలువ, గంగాయమునలు వింజామరలిడ నుభయపార్శ్వంబుల నిజవాహనారూఢులై హరివిధాతలు వేత్రహస్తులై తలంగుఁడు, పాయుం దొలంగుం డనుచు సందడి నెడఁగలుగం జేయుచుండిరి. నారదతుంబురులును, విశ్వావసువులును, త్రిపురజయాదివిద్యా

ధరులును, త్రిపురవిజయాదికంబు లుగ్గడించుచుండ సప్తర్షులరుంధతీసహితంబుగా సంతరించుకొని నడచుచుండిరి. అంత నాకాశమార్గంబునం జామీకరకింకిణీక్వాణంబులు సెలంగ ముహూర్తకాలంబునకు నగేంద్రగుప్తంబగు నోషధిప్రస్థంబునకుం జని, తదీయోపకంఠంబునం డిగిరి.

నీహారగిరీశ్వరుండు, బంధుగులు, మేదినీధరంబులు నుద్యత్కీర్తి తనతో నరుగుదేర సంతోష ముప్పొంగ నాదివిషన్మాన్యుండగు ధీరుండు సుమనఃకోదండసంహారు నెదుర్కొనియెను. ఇట్లెదుర్కొని, తుషారగిరీశ్వరుండు మేనకాదేవి పసిఁడిపాత్రంబుల జలంబువోయ; సురాసురకిరీటమణిశాణోత్తేజితంబు లగు పురాసురాంతకుని పదంబులు గడిగి కన్యాదానం బొనరించెను. అంతం దుషారగిరికన్యకాశంకరులు సంకల్పసిద్ధి వడసిరి. నివృత్త పాణిగ్రహణమహోత్సవులై భవానీభర్గులు భక్తిభావనావశంకరులై బ్రహ్మాసనాసీనుండగు పితామహునకుం బ్రణమిల్లిరి. చతురంతమధ్యాధ్యాసనాసీనులై పార్వతీసర్వజ్ఞులు లౌకికంబైన యార్ద్రాక్షతారోపణం బనుభవించిరి.

అంతఁ గమల యమృతబిందువు లందందుఁ జిలుకఁగఁ బద్మాతపత్రంబును బట్టెను. వాణి కల్యాణోచితంబులగు గద్యపద్యంబులఁ గైవార మొనర్పంబూనెను. రంభోర్వశీముఖ్యాజింభారివనితానికాయంబు నృత్తగీతుల నింపొదవించిరి. మందాకినియును, గాళిందియును నిఱుప్రక్కల వింజామరంబు లిడఁజొచ్చిరి. మహేంద్రాదివిబుధగణంబులు సమయజ్ఞులై హస్తపల్లవంబుల

నాఁదలఁదాల్చి, మహాదేవునకు వినతు లగుచుఁ జిత్తభవు బునర్జీవనంబు నర్థించిరి.

సంబంధబాంధవానుగ్రహం బొప్ప నచలాధిపతిం జరితార్థుఁ గావించి, కందర్పుని తొల్లిటికంటెను నున్నతు నొనర్చి, రతీదేవి శోకము నపనయించెను. అంతఁ బెండ్లికి వచ్చిన బృందారకనికాయంబుల బహుమానపురస్సరంబుగా వీడుకొల్పి, ప్రమథాదిగణవర్గంబుల ననిపి, మహాదేవుం డలంకారయుతంబగు రత్నగేహంబుం బ్రవేశించెను.

పిదపఁ జాలకాలంబు పరమానందంబు జెంది, శతానంద ముకుందపురందరాదులకు హితంబుగా సుతుం గాంచెను. అంబికేయుండును, గాంగేయుండును, కీర్తికాయుండును, షాణ్మాతురుండును నగు నక్కుమారునివలనఁ దారకాసురు వధియింపించి, మహాదేవుండు లోకంబు లన్నియు రక్షించె.



## 8. లీ లా వి లా స ము లు.

గౌరీదేవిని వివాహమై, కుసుమకార్ముకుని బ్రతికించి, బృందారకవర్గంబుల నిజస్థానంబుల కంపకము గావించి, హిమాచలంబునఁ దనకుఁ బారిషదవర్గము సేవలొనర్చుచు, నతిభక్తి నాదరింపుచుండ, శంకరుఁడు నూతనంబగు కుటుంబభారమును వహించి, సంసారసుఖంబును బొందెను. అర్ధ్యపైఁ దనకుఁగల కూర్మి మెట్టిదోకాని, ప్రమథగణంబులతోను, మాతృవర్గంబు తోడను, నందికేశ్వరునితోడను నదియింట నిల్లటం బుండెను.

అదియింట మదనవైరి జమిలిపాములతోడి సంగతంబు నొల్లక బంగారుజన్నిదముల సవరించుచుండెను. పచ్చియేనిక తోలు పచ్చడంబును బరిత్యజించి పట్టుపచ్చడముం గట్టెను; భస్మాంగరాగంబు పనికట్టువడఁజేసి కస్తూరితోఁ గలిపిన గంధము నలఁదుకొనియెను. అంతియకాక, యస్థిమాల్యముల పై ననురక్తిని దిగనాడి రమణీయతారహారంబులఁ దాల్చెను. నమ్మదముమీఱ మంచుగుబ్బలియింట మదనాంతకుఁ డీరీతి మనువు గుడిచెను.

అచ్చట కాళగళుఁడు వృషభపుంగవువాహ్యాళి వెడలు నపుడు ప్రమథగణంబు లిరువంకలఁ గొల్చుచు వచ్చుచుండిరి. సదాశివుని సన్నిధిని సంచరించు పారిపార్శ్వకు లాకారధురంధ రులును, మేరుధీరులునై యొప్పుచుండిరి. అవ్వీట దమకెవ్వ రితరంచు సేవెఱుపునలేక వీరలు స్వేచ్ఛావిహారంబు లొనర్చు

చుండిరి. ఇవ్విధంబున శంభుని కింకరులు జంకును గొంకును లేక సర్వత్రగర్వసంరంభముతోఁ దిరుగులాడుచుండిరి. ఆశకులు గయ్యాళు లగుచు, నోషధిప్రస్థ మిల్లిల్లు నట్టుడికిన ట్లుడుకు చుండ విద్యాధరాంగనలను, గంధర్వకామినీజనంబును, నప్సర జనంబును వారువీ రనక పట్టి పలుబాముల బెట్టుచుండిరి.

ప్రమథజటాధారులు నానాప్రకారంబుల యథేచ్ఛాచారులై యోషధిప్రస్థపురంబునందు క్షుద్రోపద్రవంబులు సేయుచుండిరి. హిమవంతుం డిదియంతయు నెఱింగి, మేనకాదేవియుం దానును మంతనం బుండి, యీశ్వరునితోడి పొత్తింతియ చాలు' నని కూఁతు రావించి యిట్లనియె "ఓకమలాక్షీ! నీమగం డసంఖ్యాతంబులగు ప్రమథగణంబులును, భూతపరివత్తు, బిశాచములును మొదలగు ధూర్తసమూహంబుల సంభావించుచున్నవాఁడు. భూతప్రేతపిశాచవ్రాతంబులతోడుగాఁగఁ బ్రమథులు రాత్రింబవళ్లు నష్టాదశజాతిప్రజలకును దుర్దశలు సంధింతురు. వీథులఁ గల్పలతాప్రసూనమాధ్వీమదమత్తచిత్తులై రాత్రింబవళ్లు వేలుపులేమలం బట్టుకొందు రీధూర్తవర్తనులగు స్వామిభృత్యులు. నీమగనికి వీరి ధౌర్త్యము మాన్పం దగదా!" యనుచు విసువు జెందెను.

మామ విసువుఁజెందుటయును, జారజనంబుల వేసటయును, బ్రమథగణంబులు సేయు ధౌర్త్యంబును నఖిలలోకేశ్వరుఁ డెఱింగి దారకావనికి నరుగంగఁ దలంచెను. ఇట్లు దలంచి నందివాహనారూఢుండును, గతిపయప్రమథపరివారపరి

వృతుండునున్నై మామ వీడుకొనక, గారికిం జెప్పక నభోమా
ర్గంబునఁ దత్పర్వతైక దేశస్థితంబగు దేవదారువనంబుం బ్రవేశిం
చెను. ఆపర్వతమున కంఘ్రిపీఠంబుగ వృద్ధకచ్ఛపరాజును, శిర
సుపాగఁగ సురతరంగిణియు నొప్పుచుండ, మేనుభూమండలమునకు
మానదండముగా నొప్పెను. పూర్వాపరంబులు దనకుఁబోరుగు
టింద్లుకాఁగ కాత్యాయనీదేవి కన్యకారత్నంబును, త్రినేత్రుఁ
డల్లుఁడునునైయుండఁ దనకు శేషశైలసామ్రాజ్యంబుపాలనీయంబై
యాగహావిర్భాగ మోగిరముగాఁగ, మాల్యవన్మేరు పర్వతా
దులుచుట్టాలుగా నొప్ప నాభూధరునిభాగ్యం బేమనందగు!

అందుఁ గాంచనమందిరంబులయందు బృందారకమిథు
నంబులు కౌతుక మొప్ప రేఁబవళ్ళుఁ గందర్పవిహారం బొనర్చు
చుందురు. రత్నాంచితరోచిరుద్గమనిరస్తరవీందుమరీచిజాలం
బును, గాంచనకందరాయవనికాయితవారిధరాంతరాళ నిర్వాం
చిత దేవతామూలంబును నగు నాశీతశైలమును నహీశ్వరు
నంతటి వాని కైనను నుతింప శక్యంబుగాదు. కల్పాదియందుఁ
బృథుమహారాజు మేరుపర్వతమును దోగ్ధగావించి భూమిని
సురభిగాను, మంచుగొండను దూడనుగాఁ జేసి యఖిలరత్నౌష
ధులను బితికించెను. శబరకన్యక లత్యంతామోదంబునఁ జాప
టంకృతులతో నీహారాదికాంతారరేఖామధ్యంబున గంధద్విప
శ్రేణులను వేటలాడుచుందురు. తనకూఁతురు మృడుమేనిసాము
కొడుకు జలనిధిచెలికాఁడు, తాను సర్వంసహాకు కడలికడలకుఁ
గొలకోలయు నగుచుండ వసుధాధరము లెవ్వియు నీవడఁకుల
కుబ్బలికి సరిరాక తనరారుచుండెను.

అక్కొండ దక్షిణభాగంబున నుండు దాక్షాయణీవనం బున కనతిదూరంబున ధర్మసంజీవనంబగు దేవదారువనము తనరారుచుండెను. అయ్యది కర్ణికామాణిక్యకనకపద్మనుల తోను, కల్పవల్లీకుడుంగిములతోడను, విమలచింతారత్న వేదికాస్థలులతోను, సిద్ధరసాపగాశ్రేణితోను, దివ్యలోకాప్సరస్త్రీకదంబముతోను, గామదుగ్ధేనుసంఘములతోను, దివ్యౌషధీలతాదీపమాలికలతోను, మంచుగుబ్బలితేని సీమాంచలమున దేవతాముని సేవ్యమై తేజరిల్లుచుండెను. అందు వసియించునట్టి సంయమిసందోహము పంచబాణసదృశమును, వారిబింబాధరలు లీలాసౌందర్యకళానిర్జితబృందారకసతులునై యొప్పుచుండిరి.

అప్పావనాశ్రమమున మునికన్యాకాకదంబము పసిండి కుండలను నిర్ఝరాంభస్సును దెచ్చి, కన్యలతలకు ముద మొప్పఁ బోయుచుండిరి. ఆవనంబునయందు గండుఁగోయిలలు జదువుసామములు జెప్పుచుండును; తుమ్మెదలు సంతోషమునం బ్రణవాక్షరంబుల నాలపించుచుండును; శుకశారికబృందము లాగమభాషితంబుల సమ్మతిం బ్రస్తవించుచుండును. నీలగళంబులు నెమ్మది శాస్త్రములఁ జెప్పుచుండును. క్రోధలోభమోహేర్ష్యామాత్సర్యాదిగుణంబులకుఁ దావీయక ప్రశాంతమతులై మును లాయాశ్రమాంతంబుల సంచరించుచుందురు. అక్కానలో విలసత్కర్పూరరంభాచ్ఛాయలందు శీతలచంద్రకాంతమణిపాషాణప్రదేశములందు వాయుప్రేరితములైన పచ్చకప్పురము పైని వర్షింపుచుండ నాయావేళల మౌనిభార్యలు గృహవ్యాపారలీలాభవక్లేశము లుజ్జగింతురు.

మఱియు, నద్దేవదారువనంబునందు మునుల వ్రతభంగంబు సేయంబూని యేతెంచిన పదునాల్గుజాతుల యప్సరస్త్రీకదంబంబులు ప్రతిజాతి కొక్కొక్కవాడ యేర్పడ నానాసన్నివేశసంకేతంబులై యుందురు. అచ్చేడియలలో విబుధమత్తకాశినీజనోత్తమ యగుతిలోత్తమయు, వశీకృతసుమనాచార యగు రంభయుఁ గలమంజుఘోష యగుమంజుఘోషయు, శృంగారరసరాశి యగునూర్వశియు నచ్చోట విహరించుచుందురు. వారికిఁ దోడుయు నీడయునై గుణపేశియగు సుకేశియు రూపానురూపస్థానికయగు మేనకయు నొప్పుచుందురు. వారు కలికిచూపుల హేలాసందర్శితమేఖలాకలాపంబు లగువ్యాపారముల, మొలకనవ్వుల నమృతరసరూపంబు లగునాలాపంబులఁ ద్రిభువనంబులను వశీకరింతురు.

అంతఁ జంద్రకళాధరుండు హరితాంకురములు మేయ నొక నవశాద్వలంబునకు నందికేశ్వరుని బనిచెను. ప్రమథులను లింగార్చనము చెల్లింప నొక సరస్సమీపంబున నునిచెను. భూతజాతము నంతను నాత్మేచ్ఛనుండ ననుమతి నిచ్చి, జోలి సంచిని బట్టి తా నొకజంగమం బగుచు నప్పుడవ్వేశ్యవాటంబునందు భిక్షాటనంబునకుం జొచ్చెను.

అంతఁ బ్రమ్లోచ మోదాఫలస్థూలాపూపఘృతాన్వితంబై, షడ్రసోపేతంబుగా, గడుందోరంబగు బిచ్చమును బ్రాలేయాచలకన్యకాధిపతికిం బెట్టెను. రంభామ్రఫలసమగ్రంబుగాఁగ నమృతదివ్యాన్నభిక్షను రంభ కామారి కొసఁగెను. హారిణి చక్షూరాగ మెలర్పఁగా గోక్షీరంబులతోడను, శర్కరలతోను, గ్రొన్నేతితోను, దేనెతోను, ద్రాక్షాదాడిమచూత

ములతోను విశ్వాసంబుగ దాక్షాయణీభర్తకు దివ్యమాధుకర భిక్షాన్నంబును వడ్డించెను. ఊర్వశి యల్లనల్లనఁ జేరవచ్చి మంచుగొండరాయల్లునికిం బినాకికిఁ బ్రియంబున భిక్షమును బెట్టెను. క్రొంబట్టుఁ బసిండిసిబ్బిలపుఁ బయ్యెదకొంగొకకొంత జారి లలాటలోచనుని మూఁడుకన్నులకును విం దొనర్చుచుండఁ దిలోత్తమాప్సరసయు భూతభర్తకుఁ బసిండిశర్కరలతోడను, ఘృతంబుతోడను, భిక్షమును బెట్టెను. అంత సహజసౌజన్య సహజన్య శంకరునకుఁ దశాకాలపుణ్యభిక్షఁ బొసఁగ వడ్డించెను.

విశ్వచతుర్దశాభువనాధీశ్వరునకు విశ్వాచి యనెడు నచ్చరచాన భక్తియుక్తి నెనకంబెనఁగ శశ్వన్మధురాన్న భిక్షు సమ్మతితోఁ బెట్టెను. చిత్తభవకీర్తి శశిరేఖయగు చిత్రరేఖ కనకనూపురమేఖలాకలకలంబు రత్నకంకణరవముతో రాయి డింపుచుండ సభవునకు మధురదివ్యాన్నమును వడ్డించెను.

మఱియుం దక్షలేఖాంగనలు భుజంగభూషణునకు నహాంగరంగస్థలలాస్యలంపటంబులగు కటాక్షవీక్షణంబులతోడ భిక్షాహారంబులు సమర్పించిరి. కందర్పసూదనుండును బ్రతిమందిరంబునం జందనకుసుమధూపదీపాద్యుపచారంబులు గ్రహించుచు నవ్వేశ్యవాటంబున భిక్షాటనక్రీడ సలిపి, యంతం దసివిసనక కనకగర్భకపాలపాత్రిం బర్ధపూర్ణంబై కరపల్లవంబున నుల్లసిల్ల నల్లనల్లన యోగపాదుకాయుగళంబు ఘల్లుఘల్లున మ్రోఁగ మునిజనాశ్రమంబు బ్రవేశించి, మునిమందిరముల మోసలల నిల్చి, "భవతీ భిక్షాం దేహి" యటంచు వారివాహగర్జాగంభీరస్వరంబునఁ బలుకుచుఁ గులాంగనాజనంబు నహాంగదృక్తరంబులం జిరునగవు లిసిరింతలువాఱఁ గనుంగొనుచు సంయమివధూపాతి

ప్రత్యూహభంగంబు దనకుం బరమప్రయోజనంబుగా గర్వోక్తిసంద ర్భముల నిజాభిలాషంబుఁ దేటపఱచుచుఁ బర్యటింపఁదొడంగెను.

మహేశ్వరుఁ డుద్దామవిలాసదారువనికాప్రదేశంబులందు సంచరించుచు దరహాసంబులను, భ్రూనటనలచేతను, విభ్రమ ప్రౌఢిని, బరిహాసోక్తులను, నర్మగర్భవచనంబులను మానినీకాం తల మనంబులం జూరలాడెను. దివ్యసంయమివరేణ్యు లిండ్ల బతిభక్తిపూర్ణమతులును, బుత్రపౌత్రవతులు, ముత్తైదువులాదిగా గలవారల నందఱను నిశ్శంకవృత్తి నాశశాంకశేఖరుఁడు విరాళి గొల్పెను. అంత మిసిమింతుండుగాక దేవదారుకాంతార మధ్యం బున మువ్వన్నెపులితోలును మొలచుట్టి, కర్కోటకాహినిబిగించి, చిన్నారిపొన్నారి శశిరాంసుఁ దలఁదాల్చి, తోలుపచ్చడంబును ధరించి నడివీథినిలిచి, యాఖట్వాంగపాణి భిక్షయడుగుచుండెను.

ఇవ్విధంబున మన్మథమథనుండు మదనోన్మాదంబునం గన్నుగానక మునికళత్రంబుల పాతివ్రత్యంబులు పులిపొచ్చుచు, విచ్చలవిడి చరియింపంబూనెను. అంత నిలింప మానివ్రాతంబు వారివారికి నెఱింగి, గుజగుజపోవుచు, వంచనంబు ప్రకాశింపం జాలక, లోలోన యడంచుకొనియుండె. అప్పాటం బ్రతిభవ నంబునఁ బొటిల్లు చీఁకటితప్పు కప్పిపుచ్చ వెరవుపడకుండు నట్లుగాఁ బ్రకాశించినఁ గట్టాయితంబై యందఱు నాజగజట్టి వేల్పుఱేనిం బట్టుకొనువారై చుట్టుముట్టిరి. ముసిముసినవ్వులు నవ్వుచు నొక్కమిఱుత నక్కుసుమశరహరుఁడు తపసులు దన్నుఁ బట్టుకొనఁ దొడంగిన వారికట్టెదుట నంతర్హితుండయ్యెను.

---

## 9. హాలాహలభక్షణము.

బాహువిక్రమకళాభాసురుం డగుజంభాసురుని ఖండించి, యాఖండలుండు దేవతలు తన్ను గొలువఁగా నానందంబున నైరావణం బెక్కి యఖర్వం బగుగర్వంబున నాకలోకంబునకు వచ్చుచుండెను. ఆసందర్భమున గంధర్వులు గానావళులచే నంచితలీలల నుపాస్వంగుచుండిరి.

పారిజాతలతికావనదేవత జంభాసురమర్దనునిపై మచ్చికతో నవసుమపత్రికరంబులతోను, వేల్పుటేఁటిలో విచ్చిన పైడి తామరలతోఁ గలసిన కమ్మని గాడ్పులతోను నాతని వీరకృత్యమును మెచ్చుకొనుచున్నదో యనునట్లు కోకిలసమీకరణదీవెన లాతని కొసంగెను. మందాకినీతరంగము లల్లలనాడుచు సంక్రందనునిమీఁద మందారలతావనాంతంబు లగుమందానిలంబుల నాతనిమీఁద గురిపించెను. అంత దేవతాభర్త యైరావణము నెక్కి, తరళమాణిక్య కుండలాభరణుం డగుచు నమరావతీ పురంబు జేరఁ జనుదెంచెను.

ఆసమయంబునఁ దనకుఁ బ్రమ్లోచయను దేవతాపురంధ్రి పావడముజేసిన పారిజాతమాల్యంబును దుర్వాసుం డాశీర్వాదపూర్వకంబుగా హరికి దర్శనం బిచ్చెను. అట్లొసంగిన కుమూర పారిజాతమాల్యం బహల్యాజారుండగు శునాసీరుండు దుర్వారవిజయగర్వాటోపంబునం గన్నుగానక పట్టి, తాలంకారకాటంకితలలాటంబగు నైరావణ కరటికుంభపీఠంబుపై నలవోకయుంబోలె వైచెను. అమ్మదాంధగంధసింధు

రంబు వసుంధరాభరణశౌండం బగుతుండం బెత్తి నున్నని యప్పూవుఁదండఁ గ్రిమ్మునఁ గ్రిమ్మఱించి విసరి, కేసరంబులు పీసరవోవ, మకరందంబు చిందఁ, బొరలు విరుగం బుప్పొడి సడలం గపోలభిత్తిభాగంబుల మొత్తెను. పిదప నున్మత్తమధు పంబుల రేఁచి యుప్పరంబునం దిర్రిప్పి, చెందిరంబుధూళిఁ దూళించి యందంద కొంతతడవు వినోదించెను. ఇవ్విధంబున నేనుంగువలన నిట్టునట్టునం బడి కుపితుచేతం బడిన పూఁబోఁడి పోలిక, బెబ్బులివాతం బడిన హరిణిచందంబునఁ బ్రమత్తుని కైవసమగు రాజ్యలక్ష్మివిధంబున విడివడియు, డస్సియు, గ్రుస్సియు, నొగిలియు, బగిలియు నాదండ దీనదశకు వచ్చెను.

దానిం గనుంగొని వికటభ్రూకుటిఫాలభాగుండును, బరిస్వేదాంబుపూర్ణాఖిలాంగకుఁడును, పాటలగండమండలుఁడు నునై కల్పాంతసంహారరుద్రకఠోరాకృతిని దుర్నిరీక్షుఁ డగుచు, దుర్వాసుం డుగ్రకటాక్షంబున నింద్రుంజూచి, గాఢాగ్రహవ్యగ్రత నిట్లు బలికెను. "ఓరీ మదాంధ! అహల్యాజార! మమ్ము లెక్కసేయక యిట్లు సేయు టెల్లఁ ద్రిలోకాధిరాజ్యజాత మగు నహంకారంబు గాదె? నేను దీవించి యిచ్చిన పుష్పమాలికను నౌదలఁ దాల్పక హస్తిచేతి కిచ్చితివిగదా! ఇప్పువ్వుదండ నీకు దండనార్హంబె? ఇతరతపోధనులకుఁ గ్రోధం బనునది బాధకం బగుఁగాని; నాతపంబున కట్లుగాదు. సలిల మగ్నికి బాధకంబై వైద్యుతాగ్నిం బ్రభవించుగతిని నాతపంబునకుఁ గ్రోధం బుద్బోధకంబే యగును. ఓకుధరవిరోధి! నాకన్నుల కిది

మాన్యం బగునా! ఇంతటినుండి నీవిజృంభణ మంతయు నణఁగి నీనాకం బఖిలంబును నిశ్శ్రీకం బగుగాక! మనంబున నించుకయు భీతిలేక నన్ను దిరస్కరించితివిగదా! నీవు గన్నుల గానవైతివి. ఇట్టి మదగర్వవికారదురాగ్రహైక సంపన్నుని రాజ్యలక్ష్మికి భంగంబు గల్గకపోవు టెట్లు? నీలక్ష్మితోఁ గూడ నీవస్తువు లన్నియు నంబుధిలోఁ బడుగాత! ఇందిర యెచ్చట నుండునో యచ్చటనే సత్పదార్థసంచయ మంతయు నుండును. నీయుచ్చై శ్రవము, ఐరావతము, అచ్చరలు, అమరద్రుమంబునిన్నియు నంబుధిం బడుగాక! ఇంతియకాదు, యమృతకుంభంబు, కామ ధేనువు, తారకాధీశ్వరుండు, చింతామణియు నంబుధిం బడు గాత!'' అని పల్కి దుర్వాసుం డంతర్ధానంబు నొందెను.

యతిపతి శాపవచనములు శతమఖునకు సహింపనలవి కాని హృదయశల్యము లయ్యెను. ఊహింప నశ్లేయగు, పూజ్యుల పూజావ్యతిక్రమము సర్వకార్యహారంబు గాకుండునా? శాపాగ్నిచే దందహ్యమానుఁడగుచు పాకశాసనుఁడు వెలవెల బారుచు వీడు సొచ్చెను. అంత నఖిలదిక్పాలకులును దైన్యమున నాతనిం గొల్చుచుండిరి. ఇట్లుండ గొంతకాలంబున కప్సరవర్గం బంతయు వార్ధిలోఁబడిరి. పారిజాతాదికుజములు మున్నీటినీటిలో మునిఁగిపోయెను. ఐరావణమును, జింతారత్నంబును, నుచ్చైశ్శ్ర వంబుతోను దధిలోఁ గూలెను. బ్రహ్మముని శాపప్రభావంబునఁ బ్రమథదిక్పాలుని భవ్యలక్ష్మి యంబుధిం జొచ్చెను. అంత సురమణి యప్సరస్త్రీలు, నమృతకుంభాదులగు సత్పదార్థములు

లేక బహుకాలము చెన్నుదఱిగి సురపతి యుండెను. అమృతము, కల్పవృక్షము మొదలుగా నన్నియు వార్ధి మునుగుటం జేసి, దేవేంద్రాదులు కట్టగుడ్డయు, దినతిండియు బుట్టక మిగుల ఖేదము నొందిరి.

ఇవ్విధంబున బృందారకు లిందిరా వ్యపాయంబున నపార దారిద్ర్యాంధకార మగ్నులై నగ్నాటులుంబోలి భయం పడి, లేట మొగంబువడి, హాటకగర్భపాలికిం బురందరుండు ముందఱగాఁజని, మునిశాపయుక్తి, రాచసిరి యబ్ధిలో మునింగినభంగి తేటతెల్లంబుగఁ దెలియం బఱచిరి. అంత నానలినాసనుండు వెన్నునిం గూర్చుకొని మహేశ్వరుని సమీపమ్మునకు నచ్చి, యాతని నిట్లు స్తుతింపఁదొడంగెను.

"జయ పార్వతీమనోహర ! జయ పరమానంద ! జయ నిశాకరవమాళీ ! జయ భూమిసలిలపావక ! వియదనలార్కేందుమూలరత్న స్తంభా ! యభినవ హిమకరరేఖా సుభికాలంకారధామశోభితమకుటా ! తరుణహిమకిరణ రేఖాభరణా ! సురనికరమకుటభాసురరత్నస్ఫురణా ! పరిచయరంజితచరణా ! నిరూపాధికాభిసంప్రతికరుణా ! అజర ! అవ్యయ ! అనపాయ ! ఆద్య ! అనవద్య ! వేదవిద్యాభివంద్య ! నిర్మలాకార ! నిర్ద్వంద్వ ! నిరుపమాన ! నిత్య ! నిజభక్తవైకుంఠ, నీలకంఠ !" అని యనేకప్రకారంబులం బ్రస్తుతించిరి.

అనుకంపాపరాధీనుఁడగుచు మహేశ్వరుం డిట్లనియె. "ఈసమయంబున నబ్ధిమథియింపవలయు. అమృతలక్ష్మీప్రధాన

మహాపదార్థసముదయంబులు లేక నతిదీనవృత్తినొందె; లోకము లెల్ల విన్నఁబోయినవి. కావున మందరాంద్రిందగ్రింబును మంథ యష్టిగాను, సర్వసర్వంసహాసంభృతిప్రవణుని దండశూకస్వామిని, దరువుఁద్రాడుగను, నింద్రాదిసురలు బలీంద్రాది దనుజులు త్రచ్చువారలుగను దుగ్ధాబ్ధితిరువందరువ వివిధసద్వస్తువులం బ్రభవింపగలవు. నేనును, బ్రహ్మయు, హరియును, గార్యప్రయోగరక్షనుండువారము. ఇట్టి మహాప్రారంభంబునకుం దగినసాధనసామగ్రియిది. శేషుండును, గమఠపతియును, నశేష భువనభారంబునకుం దగినవారి నియోగించి వచ్చునది; యచ్యుతుండు సురాసురులం గూర్చుకొని మందరాచలంబు పెఱికి తెచ్చునది. ఏనును బితామహుండును మన్నాడి పాలమున్నీటి దరికిం జేరియుండువారము. ఇదియ నిశ్చయం" బని మహేశ్వరుం డంతర్ధానంబు నొందెను.

అంత జలజాసనుండు శివు నాదేశంబున దుగ్ధాబ్ధితీరంబు జేరెను. జనార్ధనుండును దేవదానవసేనాసమేతుండై దిక్పాలురుఁ గూడరాఁ బశ్చిమదిశాముఖుండై చనువాఁడు ముందర మందరశైలంబును గాంచెను. అట జనుదెంచి, యప్పాంచజన్యధరుండు జంభారిప్రముఖులగు దివిజవరుల నెడఁ గలుగందోలంగ నియమించెను. అంతఁ గనకంపునును జేల దృఢముగా బిగియించి కటిమండలంబున గట్టి దిక్కులు గ్రిక్కుదలఁగ కంఠహుంకారంబుగావించి పాదాభిఘట్టనఁ బార్శ్వదేశంబుల నదలించి ధాత్రి గ్రక్కదలజేసి, లోకైకదుర్ధరుండగు నాతోయజాక్షుండు

మందరనగరంబు నవలీల నెత్తెను. తాను వక్షస్థలంబున నైచి కొనిన నూతనంబగు తులసిదండ వాడకుండగను, కస్తూరితిల కంబు చెమటతడిచేతఁ జెమరకుండను, దాను జుట్టియుంచిన నెమలిపింఛంబు దండకొనరేక యణుమాత్రమును గుదియ కుండను, శృంగారకంతుకం బెత్తిన ట్లాకైటభారాతిమందరక్ష్మా ధరంబు నెత్తెను.

ఇట్లెత్తినంతనే శార్దూలంబులు ఘోషింపసాగెను. సారం గంబులు సుడిగొని పర్వులిడసాగెను. పంచాస్యంబులు సైత మప్పు డాక్రందనము లొనర్చెను. ఇందిరాభర్త మహేం ద్రంబు పెఱికినప్పు డేడుపాతాళములును గగ్గోడు వడియెను. అతఁడు గిరిని మీఁది కెత్తినపుడు బ్రహ్మాండంబు కంపించెను. నాడు వరహావతార వేళ నేకదంష్ట్రాగ్రంబున ధాత్రిం ధరియించి నట్టి తోయజాక్షుండు తనబాహాచతుష్టయమున మందరాద్రిని మోయు టబ్బురం బగునా? శశాంకధరుండును, నబ్జగర్భుండును నుతియింపుచుండ మాధవుండు నిర్జరపంక్తిచేతను, నసురయూ థంబుచేతను దుగ్ధాబ్ధిచెంతకు మందరాద్రిని బట్టి తెప్పించెను. పిదప బ్రహ్మయు, హరుఁడును గార్యభారధురంధరులై ప్రవ ర్తింపం బురందరాదిసురలు జలంధరాదిరాక్షసులును సముద్ర మథనంబునకుం బ్రారంభించిరి.

అప్పుడు సకలకార్య సమారంభణాదులందు విఘ్ననాయ కుండు బూజనీయుండని తలంచి, యంభోధివేలమీఁద సురలు నసురులు నాతని దోలుదొత్తఁ బరమభక్తితోఁ గొల్చిరి.

ఆక్షీరాంభోనిధి సైకతస్థలమున హర నందనుని సింహాసనా రూఢునింజేసి, దేవాసురు లుల్ల సద్గంధకస్తూరీ సౌరభ వాసితం బుల నదీతోయంబులం బ్రత్యేకంబుగం గారామారగ నాతని కభిషేకంబు లొనర్చిరి. అదితి ప్రభవులును, దితి తనూజులును, నిభరాజాస్యున కభిషేకానంతరమున నభినవ దివ్యాంబరము లును, నాభరణములను నొసంగిరి. భవుని పట్టికిం బసిడికుంభము లంబట్టి యమరాసురులు కడుభక్తి కుంకుమాగరు మృగనాభి పంకములను, గంధకర్పూర నీహార కర్దమంబులను నలందిరి. భక్ష్యభోజ్యలేహ్యాదులైన బహువిధపదార్థంబులను వేలుపు లును, రాక్షసులును, దుగ్ధపాథోధిమథన సమయంబున విఘ్న పతికి నర్పించి ప్రీణితులైరి. ఇట్లు షోడశోపచారంబులం బూజించి, దేవాసురులు విఘ్ననాయకుని బహువిధంబుల స్తుతియించిరి.

ఇట్లు దైత్యాదిత్యులు వననిధిమథనాదియందు వారణ వక్త్రుం గొనియాడి తత్ప్రసన్నతంగని, సంతసముమీరం గట్టాయి తంబై పాతాళగోళంబు క్రిందమట్టుగా నాదికమఠంబుం బెట్టి, వాసుకిం దరిత్రాడుగాం జుట్టి, తోకయు శిరంబును బట్టి మంధరా చల మథనంబున దుగ్ధసింధువు మథింపం దొడంగిరి. అయ్యవస రంబున ఘుమఘుమధ్వానంబులు దిక్కులం బిక్కటిల్లెను. వారి వాహావ్యాహాంబులు కడల వియంజదల నుదిలకొనియె. అంభస్త రంగములు దిగిభకుంభంబుల నాస్ఫాలించెను. ఆవర్తచక్రంబు నందు గ్రహతారకానక్షత్రంబు తిరుగుపడియెను. అపుడు

దుగ్ధాబ్ధిగంగకుం బరిభవంబును, గోదావరికి ఖేదంబును, వెన్నకు విన్నఁబాటును, గాళిందికి మాలిన్యంబును, వేత్రవతికిఁ ద్రాసంబును, విపాశకుం గ్లేశంబును, శతద్రువున కుపద్రవంబును నాపాదించెను. బాడబానలంబునం దొకతొక నుడుకు నీరుసుం గలసి నఖపంచంబై సంవర్తసమయారంభంబునుంబోలె మర్యాద నతిక్రమించుచు గిరికటకపాషాణ సంఘట్టనంబున నెగయు మిణింగురులుంబోలె నంతర్మణిశిలాకాశకలంబులు మీఁది కెగయు నంభోనిధానం బయ్యెను. వాసుకి విషభరనిశ్శ్వాసంబుల సాగర మధ్యప్రదేశంబున భాసురహాలాహలంబు ప్రబలం బయ్యెను. గరళమహత్తరానల శిఖానివహంబులు వ్యాపింప జగత్త్రయము నెమ్మనంబులం దల్లడ మందెను. సురగరుడోరగామరులు సుడివడిరి; అంబుజాక్షుం డాత్రిమునొందెను. దిక్పతులందఱును నిర్గతధైర్యులై తూలిరి. పడువార్ధులును ఘూర్ణిల్లఁ జొచ్చెను. అప్పుడు సుస్థిరుండై విరూపాక్షుండు త్రైలోక్యరక్షాదక్షుండగు తనదక్షిణహస్తం బెత్తి 'యోడకుండుఁ డభయం బిచ్చితి' నని యెంతయూరడించిన నూరడిలక నారాయణాదులు గన స్వేల్పులు పలాయమాన పరాయణులై వెనుక మరలియుం జూడక పోవందొడంగిరి.

ఆసమయంబున హుంకరించి, యప్రతిమక్రోధోద్రేక సంరంభముతో నీశ్వరుఁడు భీషణవిషజ్వాలాజిమ్మృక్షార్థమై తన హస్తమును జూచెను. శంభునిముందట గరళము స్తంభించి నిల చెను. పిదప నాగరళము నేరేడు పండునుంబోలె నుండయ్యె క్రమ

ముగఁ గలశపయోధిమంథనముఖంబునఁ బుట్టిన యమ్మహా హాలాహలము చుక్కయై శివుని హస్తసరోరుహ మెక్కెను.

కటుకమగు విషంబును విషధరకటకం బగు కేలం బూని, మిగుల గౌతూహలియై ఘుటికాసంసిద్ధుఁడు రసఘుటికయునుం బోలె మృదుండు గుటుకున మ్రింగివైచెను. కాలకూటవిషం బా శివుని కంఠంబునకుఁ గంఠికానీల రత్నంబుభాతి చెన్ను మీఱుచు లలిత మృగనాభిపంకంబు చెల్వుదాల్చి, బ్రహ్మాదు లందఱు నుతింపఁ గంఠాభరణం బయ్యెను. అపుడు బ్రహ్మాదు లతని ననేకప్రకారంబులం బ్రస్తుతించి 'నీలకంఠుం' డను నామ ధేయంబు శివుని కిచ్చిరి.



# 10. సముద్రమథనము.

హాలాహలాగ్నిదాహభయ ముడిగినంతనే వేలుపులును, నిశాచరులును, మఱలఁ గవ్వపుఁగొండ వార్ధిలో నునిచి, యవక్ర భుజాబలవిక్రమంబున దానిని ద్రిప్పఁ జొచ్చిరి. తరిగొండను దరువం దరువ, శరధిమధ్యంబున పరిమళపరంపరలచే జగమంతయు సురుచిరం బగున ట్లొకజలజ ముద్భవించెను. పిదప సురసింధురంబు లిరుప్రక్కియలనుండి పరిపూర్ణహేమకుంభములు దాల్చుచుండ సర్వదేవతలును జయజయధ్వనులు సేయుచుండఁ గేలుఁదమ్ములు మౌళిఁ గీలుకొల్పగ, విన్వీధి దేవదుందుభినాద మావహిల్ల మున్నీటినడునీటను బ్రహ్మాదిక్పాలవందితపాదపద్మ యగుపద్మ కన్నులపండువగుచు, గమలకాంచనకర్ణికాగ్రంబునం దుదయించెను.

అంతఁ బవడంబులఁబోలు శ్రీహస్తపల్లవంబులు దనరారుచుండ హేమపద్మమునుధరించి, కలిమిచూపుల పూఁబోఁడి రత్నసింహాసనంబునఁ గలశజలధియందుఁ గొలువుండెను. జలగుహావాసిని పుట్టినతదనంతరంబ రెండుగడియల మాత్రంబులోఁ గలశపయోధియందు నిగనిగమెఱయుచుఁ గలువలచెలికాఁ డుద్భవంబందెను. అంత నిందిరానుసంజాతములై సంద్రమునం దందందు మందారకల్పతరుహరిచందనసంతానపారిజాతాదు లుద్భవించెను. సరోజవాసినీకాంతకుఁ దోడబుట్టువనఁగా బయోధివిధానమునయందు ధన్వంతరి యుదయించెను.

ఆదివైద్యుం డతఁ డమృతపూర్ణకుంభము నొకహస్తము నను, నంబుచరమును, గరకాయయును వేఱొకహస్తంబునను దాల్చి, సాకారమైన శాంతమయుఁ డనఁ దనరారుచుండెను. ఆతని వెన్వెంట నచ్చపువెన్నెలచాయలనుసైతము మెచ్చని తనుకాంతిదీప్తులతో మేఘధ్వనిఘెంపచ్చుపడఁగ నుచ్చైశ్శ్రవంబు సకిలించుచు నుదధినడుమ నుదయించెను. తారకారాజబింబావదాతవదనయు, తారహారాదిభూషితయు, నతిధవళనయనయు నగు తార యను కన్యకయుం దవతారమందెను. అయ్యంభోనిధి వారిమధ్యంబున నైరావణం బుద్భవం బయ్యెను. క్రమముగ రంభాతిలోత్తమాదు లగునప్సరస్స్త్రీ కదంబమును, సురభియుం గూడనుదయించెను. శీతల పరిమళధారాపవిత్రాయమాన పవమానమై యందు శ్రీ తులసీవనము శ్రీయంశమునఁ బుట్టెను.

ఇట్లు మహార్ణవజాతంబులగు పదార్థజాలంబులం గనుంగొని బ్రహ్మాదిదేవతలు హరునకు శశాంకుని, హరికి లక్ష్మిని, నిందునకు నైరావణోచ్చైశ్శ్రవంబులను నిచ్చిరి. అప్సరసల నాకంబున నుండ నియమించిరి. కామధేనువును వరుణున కొప్పనంబుసేసిరి. కల్పతరుచింతామణుల నందనోద్యానంబునం బ్రతిష్ఠించిరి. దూర్వాంకురంబులు హేరంబున కవతంసంబుగా నొనంగిరి. నాగవల్లీదళంబులు భోగార్థంబుగా భూజనంబుల కిడిరి. శ్రీతులసీకాననంబును, సకలతీర్థంబులకు సమాశ్రయంబుగావించిరి. అనంతరము మందరంబును యథాస్థానంబునం బెట్టి,

వాసుకిం బాతాళంబున కనిచి, కమఠపతిం గుస్తరించి, నివాసంబులకుం బోవ నుద్యుక్తులైరి.

దర్పాంధులగు దైత్యులందఱుఁగూడి యొక్కుమ్మడి దొమ్మిచేసి, వైద్యుని నిర్బంధించి, గ్రక్కునఁ దన్మహాసీయ దక్షిణస్కంధమువిూఁదనున్న యమృతకుంభమును లాగుకొనిరి. దీనినిగొంపోయి, దైత్యులొకచోట విడిచియుండి, యమరుల కొసంగక, తామె విభజించుకొని భుజించువారుఁబోలె నుండిరి. అవ్విధంబెఱింగి హరివిరించులు విష్ణు రావించి, "గోత్రకలహంబు మాన్ప నఖిలమాయోపాయ విద్యావిదుండవగుచు నీవ యెఱుంగుదు, మాకు నిం కిక్కడ నుండఁబనిలేదు. పోయివచ్చెద" మని యామంత్రణంబుసేసి నిజస్థానంబుల కరిగిరి. విష్ణువును ఏకార్యభారము నొకించుక చింతించి యసురుల ననుమతించి, సురల కమృతంబునొసఁగ వెరవుగాంచి యంతర్ధాన మాయెను.

ఇట్లంతర్ధానమైన ముహూర్తమాత్రంబున నాకౌకశ్శ్రీశికిని, దైత్యపత్తికిని నాహావుట్టింప విద్యుల్లేఖచందంబున నొక నీలాంభోజపత్రాక్షి యాకాశంబుననుండి దిగెను. ఆయిందీవరాక్షి యిరువంకలవారును దమవైపునకు రమ్మనుచుండ నొకచో విడిసెను. అట్లు నిలిచి, హావభావ విలాసంబుల నా దేవాసురులం భ్రమింపజేయుచు వారికి వారికి నైనయట్లు వలపు నటియించుచుండెను. అవ్వధూటి యందరను బ్రమవెట్టుచు నెవ్వరికిని దానుబ్రమయక యొడమన యుండెను. గంధఫలిమీఁద వ్రాలు భృంగంబులవగిది నందఱమనంబులు దానిపై వ్రాలి

చొక్కెను. అప్పు డప్పద్మనయన యసురులకును, దేవతలకును బాలుపోయకుండనుండెను. అంత నాయుభయవాదులునుగూడి యయ్యుత్పలాక్షి పాదపంకజములకును బట్టులెరి.

ఆసమయంబున విష్ణుమాయావిశేషంబున నిరుదెసల వారును "నిది చెప్పినట్లుచేయుదుము. ఇది పంచినయట్లు పుచ్చు కొందుము. ఇది మాకుఁ గల్యాణాభ్యుదయ నిధానం" బంచు దలంచుచుండిరి. భువనమోహినియగు నప్పూఁబోఁడిని గనక సింహాసనంబున గూర్చుండవెట్టి, కాళ్ళుగడిగి, పాదతీర్థంబులఁ దాల్చి, యిరువంకలవారును బ్రీతతో లొనర్చిరి. అంత వైరాగ్యానుబంధంబు లుడిగి, యయ్యిరువాగు వారుందమలోన "మనము పరస్పరము నమ్మికలేక యెడనుంచిన యీ యమృత మును నీవనితామణియే పంచవలయు జుమీ!" యనుచు నమృత కలశంబు దెచ్చి, యప్పయోజాక్షి చేతి కిచ్చి, ధర్మంబు, పుణ్యంబు, పాపంబు నీయది. ఇరుదెఱంగులవారు నీకు నొక్క రూప. ఇప్పదార్థంబు మాకుఁ బంచిపెట్టుము. ఓయన్నుమిన్నా! పక్షపాతములేక పంచిపెట్టెడువా రబ్బరని, అకట! అన్నదమ్ము లమై యుండి, మేము నిన్ను వడ్డించుమందుమొ?" యనిరి.

అప్పలుకుల నాలకించుచు నయ్యుత్పలాక్షి "మీయంత వారలు కూర్చుండ నమృతము బంచుట నే నేర్తునా? ఇది యల్ప కార్యంబా? తొల్లి యెఱింగిన పనికా దిది. అయిన మీవచనం బులు చెఱుపంజాలను. నా నేర్చినవిధంబున సుధారసంబు వడ్డిం చెద. మీ రందఱు గృతస్నానులై పులినవేదికాస్థలంబున నిరు

దేలంగుల వారును రెండుబంతులుగాఁ గూర్చుండుఁ"డని నియోగించెను.

వా రట్లనే వరుసగాఁ గూర్చుండి పసిడిపళ్లెరంబుల పన్నికొనఁగ నమృతకుంభహస్త యగుచుఁ దరుణి యల్లనల్లన వచ్చెను. అద్దానవులును, సుపర్వులును, స్నానపవిత్రగాత్రులును, చందనచర్చితబాహుమధ్యములును, మత్సరచిత్తులునై మహాసమాధానముతోడ నుత్తరదక్షిణముల సముపాశ్రయించి, యామెను బ్రియంబుగాఁ జూచుచుండిరి. ఆమె దూర్వాంకురాగ్రంబున సుర ధేన్వాజ్యము త్రస్తరింపఁ దొడంగి, మధుర గోక్షీరధారాసమానమైన మంచియమృతమును వైమానికులకుఁ బెట్టి మృగతృష్ణికాంభస్సమానమైన కల్లయమృతమును దైత్యులకు వడ్డించెను.

ఇవ్విధంబున నప్సరసాగణమధ్య తథ్యమిథ్యామృతాహారంబు లాసురాసురులకు వెట్టి కామదుగ్ధేనుఘృతధారాభిఘారంబుగా వించి పంక్తిమధ్యంబున నిలిచి కంకణఝణఝణత్కారంబు తోరంబుగా నాపోశనంబువోసి "యారగింపుఁడు, ప్రొద్దువోయె" ననుచు నెలుంగెత్తి మత్తకోకిల కంఠకుహూపంచమస్వరంబునం బల్కెను.

మొదలఁ దేనియ లుట్టిపడు నంభోరుహాక్షి ముద్దుబల్కులను శ్రోత్రపుటంబుల భుజించి, పిదప నాత్రిదశవరులును, దైత్యులును దథ్యమిథ్యాసుధారసంబులు భుజింపఁ దొడంగిరి. గుర్రుక గ్రుకక్కును నమరులకుఁ దేజమెక్కుచుండెను. అట్టి

విధంబుననే గ్రుక్కగ్రుక్కకు దైత్యులకుఁ దేజం బడగుచుండ రాహుకేతువులనెడు రాత్రించరులు తమయెదిరిపం క్తినున్న చంద్రార్కులనంగడి నొల్లఱంగి కూర్చుండిరి. దానింగాంచి, గ్రహరాజు లిద్దరును సుధారసము చిప్పెడుపోయకమున్న శౌరికిం జెప్ప నున్నంతలోన నిరుగంచములయందును బుడిసె డంత శౌరి పోసెను. అప్పుడు వారును ద్రావియును ద్రావ కుండగ రాహుకేతు లంచు మురవైరికిం జెప్పిరి.

మాయపుంబడతి యాకారమును వీడ్కొక శ్రీకాంతుం డవిభ్రాంతుండై యామాట వినినంతనే తత్సుధారసము కంఠాధఃప్రదేశము సొచ్చుట లేకుండఁగ జక్రమున రాహుకేతువుల యత్యుద్రోత్తమాంగంబు లొక్కట ఖండించెను. దివిజు లంతట హాహానినాదకోలాహలంబులతోఁ గలంగిరి.

తత్క్షణమే మాయవధూవేషమును దిగఁద్రోచి కైటభారి నిజరూపమును గైకొనెను. అంత హరి తమ్మువంచించె గావున నిది సరివేళ కాదని దైత్యులు పాతాళమునకుం జనిరి. వేల్పు లమృతమును భుజియించి, యమృతకుంభమును తమ నిజస్థానమునకుఁ గొంపోయిరి.



# 11. పాశుపతవ్రతము.



ఇంద్రకీల గిరియం దర్జునుఁడు ధర్మజుని యనుజ్ఞ వడసి భూరుహాపుణ్యతమాశ్రమంబున శత్రువ్రాతజయార్థము దివస్పతిని గూర్చి తపంబు సేయంబూనెను. శత్రువిజయకౌతుకము మదిం బొల్పార నత్యంతనిష్ఠతో నన్నగాగ్రంబున ధనురస్త్రంబులను గేలఁదాల్చి, శరముల వీపున బంధించి, కిరీటియై, కవచియై యర్జునుఁడు తపశ్చర్యం బూనెను. ఆపాంచాలీవల్లభుఁడు మనంబున నొకించుకయునువంచనలేక పంచానలమధ్యంబున నుగ్రతపంబొనరించెను. ఆ ఘోరాటవి మధ్యంబున నాకేశనందనుండు శాకాహారుండును, నిర్జితేంద్రియుఁడును, బాషాణాగ్రతల్పుండునునై త్రికరణశుద్ధి నానాప్రకారంబుల నానాతపశ్చర్యల సల్పెను.

గాండీవమును ధరించినవాఁ డయ్యును నొకదండ యష్టిం బట్టి, యస్త్రములం దాల్చి, కొన్ని దర్భాంకురములఁ జేతం బూని క్రీడి విరుద్ధంపు దపశ్చర్యం బూనెను. నిర్ఝరాంభఃప్రవాహంబుల స్నాన మాచరించుచుండెను. కొండగోఁగులం దెచ్చి చంద్రమౌళిం బూజించుచుండెను. స్ఫటికాక్షమాలిక నాతఁడు దక్షిణహస్తంబునంబూని జంభారిమంత్రంబు జపించుచుండెను. ఒంటికాలిపై నిలిచి, తపం బతిఘోరంబుగ నాఘోరకాననంబున నొనర్చుచుండెను.

ఇవ్విధంబునఁ గపికేతనుని గాండీవంబును బూనిన కరంబులు నీవారశాకం బొనర్చుచుండెను. ఆతనివక్షంబు రుద్రాక్ష

ధారణం బాచరించె; కంఠంబు మహేంద్రదేవతామంత్రాక్షర ధారణంబు సలుపుచుండె. ఖాండవదహనవేళావిజృంభితావష్టం భసంరంభంబగు హృదయాంభోరుహంబు ప్రణవోపలంభనము పాల్పడె. శాఖాశిఖరపక్షిలక్ష్యావలోకన జాగరూకం బగువీక్ష ణంబులు నాసికాప్రదేశానుసంధానంబునను, యంత్రిమత్స్య విభేదనోపాయ సందర్శనపరిభావసంసిద్ధియగు బుద్ధి వృద్ధోపసేవ నమున నాతండు లగ్నంబుజేసె. గంగాజలనిగ్రహానుగ్రహ పాదసమగ్రంబగు మానసోత్సాహం బింద్రియ భంగంబునకును, నుత్తరదిగ్విజయయాత్రాధురీణంబులగు చరణంబులు తీర్థగమ నంబులకును బాల్పడెను.

ఇట్టి విధానంబుల నాకిరీటి జగజెట్టిబిరుదంబు నెట్టుకొనం జేసి తంద్రిగుఱించి తపంబుజేయుచుండ దినంబులు గడచెను; వారంబు లరిగె; పక్షంబులు సనియె; మాసంబులు వోయె; ఋతువు లతిక్రమించె; నొకవత్సరంబు సహితము దాటెను.

ఆసమయంబున నొకబ్రాహ్మణుండు పార్థునికడ కేతెం చెను. అతఁడు వృద్ధుఁడు. ఆవృద్ధతాపసి కుతుకంబున నర్జుననకు నజ్ఞాతిగా నేతెంచి, కిరీటి నాశీర్వదించి యిట్లనియె.

"మహాత్మా! నీసంగడంబునం దపంబు జేయవచ్చితి; నిచ్చో గొన్నిదినంబులు క్రూరజంతువులు నన్ను బాధింపకుండ నరసికొని యుండవలయు" నని పల్కి యతనిముందటఁ బరి శ్రాంతుండుఁబోలె జతికిలంబడి కూర్చుండెను. బ్రాహ్మణుండు మోఁటకునిచందమునఁ బాండవేయునిం జూచుచు బరమనాస్తిక భావము పరిమళింప నిట్లు పలికె.

"ఎవ్వరివాఁడవీవు ? నీమంత్రాదివిధులు బరికింపఁ బాక శాసను నుద్దేశించియున్నది. ఏకతంబున నీఘోరతపం బాచరించెదు! ఎలప్రాయమువాఁడవు; నీభాగ్యరేఖ నీ నెమ్మొగంబున దాండవించుచున్నది;అక్కటా! నీవిట్టి ఘోరవీరతపం బాచరింపందగునె? నీశరీరచాపాదులును, నీమనశ్శాంతియు, దాంతియుఁ జూడఁజూడఁ జంకదుడ్డును, శరణార్థియు, ననెడివాక్కునీయం దెంతయు నిక్కముగాఁ దోఁచుచున్నయది. వైరి మత్త గజముల కుంభముల విదారణదారుణకృపాణములఁబూను నీకరములు కందమూలములుఁ బెఱుకుటకుఁ బాలుపడెఁగదా! ఈదీర్ఘవక్షము, బాహుభుజాసారము, నీదీర్ఘకోదండము నొక్కొక్కటియె భువనైకాధ్యక్షతాహేతువగుచుండ, నీవే కోర్కతో నిట్టి యేకాగ్రభావంబున నుగ్రతపం బొనర్చుచుంటివి? సృష్టి, స్థితి, లయకారకులగు బ్రహ్మ విష్ణు మహేశ్వరాదులఁ దూలనాడి వజ్రధరుఁగూర్చి తపంబు సేయుచుంటివిదేమి? నీ కెవ్వఁ డిట్టి యుపదేశంబిచ్చె? ఇచ్చెబో గౌతము నింటఁజేసిన కారుగోష్ఠి నీవైన మదిం దలంపరాదొకో? ఈదేవేంద్రునివలన నీవేమిఫలము నొందెదవు? చాలు, చాలు నీవాంఛ. వాఁడు నీకంటె నేవిధంబునఁబెద్ద? ఇంక నీతపంబును జాలించు" మంచు దేవేంద్రు నెంతయు నావృద్ధతాపసి తూలనాడఁజొచ్చెను.

అయ్యర్జునుం డెంతచెప్పినను దనదీక్షను బోనాడక తపం బొనర్చుచుండ నయ్యేకాగ్రభావంబునకుం బ్రియం బంది, వృద్ధ బ్రాహ్మణవేషముమాని వృద్ధశ్రవుండు వరంబు వేడుమనియెం.

“గురుభీష్మకర్ణకృపాశ్వత్థామలతోఁ గూడిన కురుబలము న్వరి మార్చునస్త్రము ననుగ్రహింపు” మని యర్జునుఁడు వేడెను. అంత 'నియ్యది శంభుని కృపావిశేషముననఁగాని సిద్ధింపనేర' దని యింద్రుండనియెను. 'పశుపతిగూఱించి తపంబు సేయుము. అభీష్ట సిద్ధి యగుఁగాక' యనిదీవించి యింద్రుం డంతర్ధానంబునొందెను.

దీవనల నందికొని, యర్జునుం డభవుగూర్చి యింద్రకీలాచలంబుపై నతిఘోరవీరతపం బారంభించుటకు భసితోద్ధూలిత నిర్మలావయవుండును, బంచాక్షరీసంతతాభ్యసనవ్యాప్తిపరాయణుండును, శివధ్యానానుసంధాతయునై పాశుపతదీక్షారంభముం గైకొనెను. మృదులభస్మశయ్యనుండి మేలుకాంచి యమల రుద్రాక్షధారణం బాచరించి యాతఁడు హరున కరుణోదయార్చనం బొనరించుచుండెను.

ఇంద్రకీలప్రపాతపతయాళునిర్ఝరస్నానుండై కపితకేతుఁ డుపచారవిధుల నన్నిటను దపనోదయవేళ వ్యాళధరుని బూజించును. కస్తూరికాద్రవకాలాగరుగంధసారసురభిద్రవ్యంబులను, బూవులను, నానాధూపధూమంబులను, నాపాకశాసననుతుం డర్ధేన్దుకోటీరునిం బూజలు సేయును. ఆతఁడు మనోవీథి న్సదానందుఁడై పంచాక్షరీమంత్రపరంపరానిష్ఠాతత్పరుఁడై యర్ధేన్దుకోటీరుని మధ్యాహ్నకాలంబున సేవించుచుండెను. సాయంసమయమున నిర్మలచంద్రకాంతమణిపాషాణతలంబున న్సంధ్యానటుండగు ధూర్జటినిగూర్చి పూజలొనర్చుచుండెను. అర్ధనిశాసమయంబునను, బార్థుఁడు సంస్కృతాత్ముఁడై వివిధపుష్పోపహారములతో నంచితభక్తి శివునకుఁ బూజలొనర్చుచుండెను.

ఇవ్విధంబునఁ బాశుపతదీక్షాధురంధరుఁడై కాలకంధరుం గుఱించి పూజ లొనర్చుచు నొక్కనాఁ డింద్రతనూభవుండు దేవార్చనాపుష్పకోరకముల్గోయుచుండ భాభామహారవంబుల వినియెను. బెబ్బులిసమూహములకంటెను బిరుసులై మిగుల పొగరు మిగిలి సారమేయయూథము లుదాత్తానుదాత్తస్వరంబుల నత్యుద్ధతములై పైపైవచ్చెను. కనకపుశృంఖలముల శునకంబులను బ్రమథులు బట్టుకొని నిరుచక్కియల లీలావనచరులై తన్ను గొల్చుచుండ నాపరమేశ్వరుఁడు కిరాతవేషంబుదాల్చి, యగజ చెంచెతయై తోడ నరుగుదేరఁ బాణి నోంకారదివ్యచాపము ధరించి వివ్వాచ్చు వరతపోవనముకడకు వచ్చెను. ఆసమయంబునఁ బురందరనందననిశాకరధగుల నడుమ నొకపందివడిఁ బాఱుదెంచెను. ఈశుఁడు దానిని బినాకచాపముననేయ వాసవసూతి గాండివకార్ముకంబున బాణము నేసెను అంత నాసూకరము శరఘాతవేదనను దిరుగాడఁ జొచ్చెను. పిదప ఘుర్ఘురఘోషంబుతోడ నాక్రోడము నేల గూలెను. అపు డా కిరాతవేషధారి సాటోపంబుగా సగర్వంబుగా నింద్రసూనునితో నిట్లనియె. "ఓరి! నీవెవ్వఁడవు! నాయెదురఁ బాఱు పంది నేసితివి. ఈయింద్రకీలపర్వతంబేలు వనచరసార్వభౌముఁడ నని యెఱుఁగవా! ఇక్కిటిఁ జంపుదు నని వాక్ప్రతిజ్ఞానియమంబున దానివెనుకజాడగ వచ్చుచుండ నావేడ్క యెల్ల జెఱచితివి గదరా! తపస్వివైయున్న నీకుధనువు బట్టఁదగునా! శాంతవరుల కీజీవహింసయేల? ఓ కపటధార్మిక! అత్యంతకల్మషాత్మ

నాపంది నేయనీవెవ్వఁడవురోరి! దానిగుండియ పగులంగశరము నేసి దీనిని గూల్చితి. అట్టిదానిపై శరము నిగుడింపఁ బ్రయో జనమేమి? తబిసివిగానఁ జావునకుఁ దప్పితివి."

అనినఁ గిరీటి యయ్యాటవికచక్రవర్తి కిట్లనియె. "పై వచ్చు కూరజంతువు నేయుటకు సిగ్గేల? ఈవక్రభాషణము లాడక నీచనుతోఁ బ్రవనుబొమ్ము. జోటియు, నీవును గుర్కర కోటియుఁ గడు డస్సినారు. ఇచ్చోట వసింపఁదలచితిరేని సుఖ ముండఁదగును." అంత నాపుళిందుఁడు మొఁగ మడ్డముతిప్పి "మమ్ము నధిక్షేపించితివి. ఈతప్పునకుఁ దపసివిగాన నిన్ను శిక్షింపను. తాటియంతవిల్లు ధరియించినాఁడవు. నీదు తబిసి తనము దాంభికముగాఁ గానంగనయ్యెడు. ఏమో నాహృద యంబు నిన్నుగని చాపమందానసమైయున్నది. నిశితనానా క్రూరనారాచములు నామీఁద న్నిగుడింపుము. చెంచని నన్నుం జూడకు. సంగ్రామంబున నన్ను మెచ్చించెదవేని నిన్ను సేబా సందు"నని గుణధ్వనిజేసిన నర్జునుండు రోషించి గాండీవగుణ గర్జాడంబరమున నంబరంబు పిక్కటిల్ల నాటక్కరివిలుకానిపై భల్లంబులు నిగుడించెను. విజయాస్త్రవ్రాతము నీశ్వరుండు దుర్వారాహంకృతిని ద్రుంచెను. శితికంఠుఁడేయుశరముల నరుఁడు ప్రతిహతము సేయును. పార్థునిశరముల శితికంఠుఁడేయు శర ములు ప్రతిహతము సేయును. అంతఁ బరమేశ్వరమాయాశక్తిచే సురపతిసూతికి శరశూన్యము లయ్యెను. ఆకలహాక్షోణియందుఁ బినాకపాణికుహనాకాటిల్యశిల్పంబున గాండీవికి సర్వము నిష్ఫల

మయ్యెను. కిరీటియుఁ దనప్రగల్భత చెడఁ గటగటఁ బడియెను. “నా పాండిత్యం బెటుపోయెనోకో” యంచు గంగాధరుని గాండీవి గాండీవంబునఁ బూన్చి వేయఁదొడగెను. ఆసమయంబున జెంతనున్న చెంచెత వడవడ వడఁకెను. పిదప వారిరువురును మల్లయుద్ధమునకుఁ గడంగిరి. వారు తాఁచుచుఁ, బొడుచుచుఁ గూలంద్రోయుచుఁ దూలుచుఁ బెగ్గగఁ జొచ్చిరి. కొంతవడి సాదృశ్యం బదృశ్యంబుగా వారు ముష్టాముష్టిరణంబు సేసిరి. కడిమి నర్జునుఁడు ధూర్జటియురమును బిడికిటపోటునఁ బొడిచెను. అంతఁ జంద్రకళాధరుండు పాండుసూతియెదుర కృపాన్వితుఁడై, స్వర్వాహినీవేణితోఁ బ్రత్యక్షం బయ్యెను. అంత నా చెంచెతయుఁ బార్వతియయ్యెను; చెంచులు నిజాకృతులం బొంద భూతంబులైరి. వేలుపు లాకసమునుండి శివునకు నమస్కృతు లొనర్చుచుండఁ బార్థుఁడు విస్మయవిభ్రాంతచిత్తుఁడై నిలుచుండెను. కొంతతడవు విస్మయం బొంది చంద్రార్ధమౌళిని బ్రణవగీతంబుల నయ్యర్జునుం డిట్లు స్తుతింపఁ దొడంగెను.

“ఓనిశాటభూష! నీకు సాటియెవ్వ రోగంగాస్రవంతిక! నీయంద సకల జగంబులు న్నిలుచు; నీవ సకలజగంబుల నుందువు. నిన్నెఱుంగ నయ్యజునకునైనఁ దరంబగునే? నిన్నెఱుఁగఁ జాలక కొండకిరాతుఁ డంచు నసంగతభాషణంబుల నాడితిని. నీశరీరమును ముష్టిఘట్టనంబుల నొంచితిని. మూఢమతినై గాండీవశరచాపంబుల మోదియుఁ బెక్కుచందముల ద్రోహముఁ జేసితి”నని మఱలమఱల నామాటల ననుచు సాష్టాంగప్రణామం

బుల నాచరించిన పాండవమధ్యముం గన్గొంటవీక్షించి "నీతపంబు నకుం బాశుపతవ్రతనిష్ఠాగరిష్ఠతకు, భుజాశౌర్యంబునకునంతసిల్లితి. నీయభీష్టవరం బానంగెద. వేడు"మని శివుండానతిచ్చెను.

పార్థివుం డంత "నాకీప్సితంబగు వరంబు బ్రసాదించి, నన్ను రక్షింపం దలంచెదేని, రౌద్రమై, ఘోరమై, లోక రక్షమైన పాశుపతాస్త్రంబు నాకొసంగు"మని ప్రార్థించెను. శంభుం డాపల్కులకుం బ్రీతచేతస్కుండై శాంభవీహృదయాను రాగంబునను, ప్రమథపరివార సమక్షంబునను, మందస్మితంబు శందళింపం గరుణాకటాక్షవీక్షణంబున సవ్యసాచికుమారులం జూచెను. అంతం ద్రిపురదై తేయ సుందరీవదనారవింద వాసరా వసాన సంధ్యాసమయ సమారంభంబును, గరటిదనుజకుంభ కూట కపాలజ్వర స్తోమంబును, జలధరవ్యూహ ఝుంఝూసమీ రంబును, నంధకాసురాంధకార ప్రద్యోతన ప్రభామండలంబును, శార్దూలదానవారణ్యవాహ్య వాహంబును నగు నమ్మహనీయ దివ్యాస్త్రంబు ససంప్రయోగంబు, సోపసంహారంబు, సకలంబు సరహస్యంబుగా నుపదేశించెను.

అపుడు సేవానమానన్నులగు కింపురుష గరుడ గంధర్వ విద్యాధరులు తమతమ దివ్యాయుధంబులు పార్థున కిచ్చిరి. పార్వతీదేవి యక్షయబాణతూణీరంబు లావీరవరున కొసంగెను. దండధరుండు దండంబును, పాశపాణి పాశంబును, నిందుఁడు వజ్రంబును సమర్పించిరి. ఇట్లు వరప్రదానంబు సేసి, యాకాశానుండు సపరివారుండును, సాంబుండునునై యంతర్ధానంబు నొందెను.

## 12. పాశుపత ప్రభావము.

శివుం డంతర్ధానము నొందినపిదప పాశుపతగ్రహీతుం డగు పుత్రుం గాంచి, బలవిరోధి పరమసంతోషమునుబొంది, వానిం గౌఁగిటఁ జేర్చికొని యిట్లనియె. "తపోనియమాతిశయం బునఁ బన్నగకంతుచే విశ్వభువనోపకృతిప్రతిపాదనైకసౌభాగ్య ధురంధరంబైన పాశుపతాస్త్రముం బడయుట భాగ్యంబుగాదె! ఇంక నిజరాజ్యలక్ష్మికిఁ గురురాజుపయి వైరాగ్యము బుట్టుఁ గాక! నీవు నారాయణసఖుండవైన యాదిమునీశ్వరుండవు. నర నారాయణులవలనఁ ద్రివిష్టపంబునకు రాక్షసబాధలు శాంతి బొందె. ఇప్పుడు హిరణ్యపురనివాసులు నివాతకవచకాలకే యాదు లగుదైతేయులు రాజ్యలుబ్ధులై, నాకంబున కనేకప్రకా రంబుల నుపద్రవం బాపాదించుచున్నవారు. వారిం బరిమార్చ నమరావతీపురంబునం గొన్నిదినంబులు వ్రిశోపవాసప్రయాస ఖేదం బపనయించి, మధ్యమలోకమునకుం గ్రమ్మఱ నేతెంచు నది. మాతలిసారథికం బగురథంబు పుత్తెంచెద నిచ్చోటున యుండుమ" దని రోమహర్షుం డను ఋషింజూచి, "నీవు ద్వైత వనంబునకుంబోయి, పాండవుల కర్జునకుశలవార్తయుఁ బాశు పతాస్త్రలాభంబును, స్వర్గగమనంబుం జెప్పు" మని పల్కి, యిందుఁడ్రిందు నిజస్థానంబున కరిగెను.

పిదప నర్జునుం డొకకల్పవృక్షంబు క్రీనీడ మణిశిలాంతరమున విశ్రమించెను. ఇంతలో మధ్యాహ్నవేళను మహాశాళంబైన

నభోభాగంబున బీరెండ వీకం గాసెను. అప్పు డతఁడు మధ్యాహ్న కాలపూజకు నాయితం బై, పావననిర్ఝరాంభః ప్రవాహంబున నఘమర్షణస్నాన మాచరించెను. తెలినీటను గసటువోవఁ గడిగిన సలిలకాషాయవస్త్రమునుగట్టి, యాతఁడు కమ్మని భసితంబును నాపాదమస్తకం బఖిలాంగకంబుల నలఁదుకొనెను. వెడందముత్యములతో నెడవెట్టి గ్రుచ్చిన మంచిరుద్రాక్షదామములనుదాల్చి, పంచశుద్ధులు గావించి, యాపాండుసుతుఁడుమధ్యాహ్న వేళ నీలగళునకు షోడశోపచారంబులు సొరిదిఁదీర్చెను.

ఇట్లు శివలింగార్చనముదీర్చి, కందమూలఫలోపహారంబులు సమర్పించి, తత్ప్రసాదంబునఁ దాను దేహయాత్ర నడపి, విశ్రాంతుండై యుండెను. ఆసమయంబున ధవళహాయసహస్రంబులఁ బూన్చిన రథంబు గొనివచ్చి మాతలి తనకుం బొడసూపిన సబహుమానంబుగా నాదరించి, పురందరాదేశంబున నద్దివ్యస్యందనం బెక్కి యాకాశమార్గమునం జనెను. మాతలుం డంత 'నిదె మేఘమండలము; ఇవి విమానంబు లవి యక్షవిద్యాధరోపాశ్రయంబులు; అల్లదె తారకావీథి, యాకాన్పించెడి తెల్లనిరేఖయే యభ్రగంగ' యంచుఁ జూపించుచుండె. అంతియకాక, 'యల్లదె యాగోచరించువారు సప్తర్షులు, వారశ్విన్యాదులుకారె!' యనుచు గగనమార్గంబునందు మాతలిచూపించుచుండ నర్జునుం డత్యంతకౌతుకంబందె.

ఇవ్విధంబున మాతలిసారథికంబైన యారథంబుమీఁద నక్షత్రమండలం బొలసికొనుచుం జని, యర్జునుం డమరావతిం

బ్రవేశించెను. అచ్చట దివ్యాంగనాపాంగ సమాలింగిత సౌభాగ్యంబై, రాజమార్గంబునం జని, దివ్యమందిరంబుఁ బ్రవేశించి, సుధర్మాభిధానంబైన యాస్థానమండపంబునఁ గొలువున్న మహేంద్రు న్నర్ధాసనంబున నుండెను. మందరావిపినవీథి దివ్యసౌధంబునందుఁ బ్రతిష్ఠఁజేసి, పాండురాజకుమారుని జయంతకుమారునికంటె నాఖండలుండు ప్రియంబున గారవించెను.

అట్లాత్మీయసింహాసనార్ధంబున నర్జును నుపవిష్టుం గావించి, యాఖండలుం డిట్లనియె. "బాహాబలాటోపపరిపాటి నీశానుని మెప్పించి పాశుపతంబు బడసితివి. పురవైరి కరుణచే నిర్జరులవలన శస్త్రంబుల సంగ్రహించితివి. కుంభజుచేత నేకొఱంతయు లేకుండ చాపనైపుణ్యంబులం గైకొంటివి. శౌర్యంబున నీసాటి వీరులెవ్వరైన జగంబునం గలరే! ప్రతాపోద్ధతిని, ప్రభావమహిమంబునను, ధైర్యమునను, జూపలీలారంభమునను, సాహసిక్యంబునను, దేవదైత్యనరగంధర్వాదిసంఘంబుల నిన్నెదిరింపంగల వీరు లేరీ? ఓపార్థ! సుపర్వహితార్థంబు నాపనిచిన పంపు; నోశౌర్యనిధీ! నీవు చేయవలయును. అలఘుబలను, నివాతకవచాఖ్యులును నగు ఘోరదానవులు జలనిధియం దుండుదురు. వారు నిర్జరసిద్ధసాధ్యకుండలి నర కిన్నర ద్యుచరనాయకకోటికి నసాధ్యులు. వారివలన ముజ్జగంబులకును నిరంతరబాధలు గలుగుచుండును.

"మఱియును, వార లెందఱేని ననమానబలులును, సురలోకకంటకులునై తఱచుగ బాధచేసెదరు. నిర్జరాళికా

దైత్యు లవధ్యులు. అర్జునా! వారల భవదీయ శరార్చుల పాలు సేసి, మాకందఱకును హితం బొనగూర్పు" మనుచు దనతొడిగిన భూషణంబులు, తనదుకిరీటము, నభేద్యతరకవచంబును దన సుతున కొసంగెను.

ఇట్లసురలోకంబు నిర్జింప ననువ, సంగరోత్సాహంబు వహించిన నర్జునుని నిర్జరులు హర్షమున బహువిధంబుల స్తుతియించి ప్రోత్సహించిరి. అంత, వారు దేవసంబంధంబైన దేవదత్తం బనుశంఖంబు నిచ్చినం బుచ్చుకొని యర్జునుండు మాతలియుం దానును దద్రథాధిరోహణంబు చేసి, నివాతకవచవధార్థం బతిరభసంబున నరుగుచు మహాసముద్రముం గాంచిరి. తదీయోదరంబున బురంబును గాంచి, సమరోత్సాహము సందడింప, నర్జునుం డత్యుద్ధతిని శంఖనాదం బొనర్చెను.

భైరవంబగు నమ్మహారవంబు కర్ణశూలంబై తాఁకినఁ గనలి, దానవులు ప్రముఖంబులగు మహాస్త్రశస్త్రంబులు వహించి, వికటగర్జారవభరంబున నంబరంబు పిక్కటిల్ల నొక్కపెట్ట యమ్మహానగరంబు వెడలి, తదీయస్యందనంబు జుట్టుముట్టిరి. అంత నాదైత్యులు వాసవిపయి నొక్కుమ్మడి మహాశనివర్షంబులు వర్షించిరి. దానవు లలుకంజేసి, యొక్కుమ్మడి తదీయస్యందనోరుద్యుతిస్ఖలనంబును, సురసిద్ధచారణ మహాశ్చర్యంబు గావించుచు, గలహాక్షోణియు, నాకసంబును, దిశలను గాండపరికాండంబులం గలయంగప్పి, భూతావళులు నమూకంపింప నఱల్చి యార్చిరి.

భయభరంబునఁ ద్రిదశులు వెలవెలఁ బాఱిరి. అర్జున సారథియు ధైర్యమును బోనాడి, తేరుగడుప బ్రమసియుండెను. అంతఁ దానె రథియు, సారథియు నగుచు నరికోటి నెల్ల నర్జు నుండు బరిమార్చెను. అర్జునుని దోర్జయవిక్రమమును, దోఃఖర్జా భరంబును, సారథి యకార్జిత్యంబును గాంచి, నిర్జరసారథి యచ్చెరు వందెను. అంత గాండీవ ప్రసరదస్త్రవ్రాత దీవ్యత్ప్రాణసంభి న్నాంగములై, సంగ్రామరంగంబున సురారితనువులు కుంభ ణము లట్లు రక్తములు గురిసెను. దనుజులు చేయునది లేక, మాయాయుద్ధంబుసేయ మదిఁ దలఁచి, ధైర్యమును బోనాడక పరుషవర్షాస్త్రముల వైచిరి. పామును వ్రేలగట్టినభంగి నలు గడల బాణపరంపరలు పాండవేయునిమీఁద జడివాన గురిపింప మొదలిడిరి.

నరుఁ డంత బలభిధ్వంసి వరంబునం గొనిన దీవ్యన్మారు తాస్త్రంబుచే జలవాహంబులు వట్టఁజేసెను. దైత్యు లుగ్రస్వాం తులై యేచి, దారుణాశ్మములఁ బార్థుం గలయం గప్పిరి. ఆతండును గులిశాస్త్రమేసి వానిం దోడ్తోనఁ ద్రుంచెను. దైత్య పుంగవులు తిమిరమహాస్త్ర మేసి, రణతీవ్రత, నూపినతోడనే గాఢమహోద్ధతి నల్గడలఁ జిమ్మచీఁకటులు గ్రమ్మ, సురేంద్ర సారథి బయం బంది "యర్జున! యెటుపోయె" దని యెలుంగెత్తి యాహ్వానంబుసేసి "తొల్లి దేవాసురసమరంబు లనేకంబులు చూచితి, యిట్టి భయోద్రేకజన్యంబులగు జన్యంబులుసూడ, వీరు వరజనితవీర్యదర్పితులు; గావున వీరిసంహారంబు ఘోరం"

బని మాతలి పల్కెను. వాని నూఱడించి 'మద్భుజావిహారం బించుక సేపు చూడు' మని ఫల్గునుం డనెను.

పార్థుం డంతం దమస్సంభారం బంతయు నడగునట్లు జంభ ధ్వంసి వరంబునం గనిన యస్త్రంబునేయ సంగ్రామరంగంబున దితిజు ల్బయం బందిరి. దైత్య తనువు లంత జవ మేపాఱంగ నేలంగూలెను. ఇట్టి నివాతకవచులు నిరవశేషులై మడిసిన సం క్రందననందనుండు పురంబులోనికిం జని, యంతయుం గనుం గొని, మాతలి కంతయుం దెలియం జెప్పెను. మాతలి 'భవ దీయ సత్త్వసాహసంబులకుం గొలంది యెక్కుడియది' యర్జునుం బ్రస్తుతించి, రథంబు గ్రమ్మఱించెను. ఇట్లు నివాతకవచాదులం బరాభవించి, భవ్య తేజోమూర్తి రీక్షుండై, పాండవేయుండు దైవతపతికడకు మరలివచ్చెను.

మార్గమధ్యంబున నుజ్జ్వలంబు లగుచున్న నొకతపోవనం బును నతివిచిత్రశిల్పమగు పట్టణంబును గాంచి, సారథింజూచి, 'యిది యెవ్వరిపుర' మని యర్జునుం డడిగెను సారథి తద్వచ నంబుల కిట్లనియె "నియ్యది హిరణ్యపురంబు. ఇందుం బౌలోమ కాలకేయులను నసురు లుండుదురు. వీర లింద్రాది దేవతల కసాధ్యులు.

ఫల్గునుం డంత "నిప్పురంబుమీఁదం దేరువరవు" మని మాతలిం బనిచెను. దైత్యు లిదిగాంచి, మాయాయుద్ధనిబద్ధ బద్ధులై తమపురంబులతోడ నంతరిక్షంబునకు నెగసిన నిశితశర నికరపంజరప్రపాతంబున నూర్ధ్వగతినిరోధంబుచేసి, వారి నేలం

బడనేసి, ఫల్గునుండు నన్యపరికారంబున జయింపరా దని మదిం దలంచెను.

వాసవసూతి యంత మహాదేవుని భవ్యమూర్తి హృదయంబున నిల్పి, త్రిదశశత్రువులమీఁద బరమనిష్ఠను బాశుపత దివ్యబాణంబు దొడిగి ప్రయోగించెను. ఇవ్విధంబున నర్జునుండు హిరణ్యపురనివాసుల గీటడంచి వచ్చి, వాసవునకుం బ్రణామంబు చేసెను. అతఁడును నివాతకవచపౌలోమకాలకేయాది రాక్షసవధపరికారంబు నంతయు మున్నె సూతలివలన విని యుండెను.

ప్రణామం బొనర్చిన సుతుం బ్రియంబున జూచి "సురలకు హిత మొనరించితివి. ఇంక ధర కేగుము. హరియు, నీసహోదరాదులును నిన్ను జూడఁ దద్దయుఁ ద్వరితపడుచుం దురు. కదనమున నిన్ను దొడరఁగ ద్రిదశమరుత్సిద్ధసాధ్య దేవాదులలో నెదు రెవ్వరు లేరు; ఇంక మానవుండు నీకుఁ బ్రతియగునా? ఇంతియ కాదు; వినుము.

ఉ. ద్రోణుఁడు భీష్ముఁడుం గృపుఁడు ద్రోణసుతుండును గర్ణుడున్ రణ
క్షోణి నవశ్యమున్ భవదిషుప్రహతిన్ మహితానుభావ సం
ప్రాణబలాఢ్యు లయ్యు నిట రాక్షసు లట్లనె యొదురింక న
త్రాణుల ధార్తరాష్ట్రుల దురంబున గెల్చుట నీకుఁ బెద్దయే.

అనిపల్కి, వాసవుం డనేకమణివిచిత్రపీతాంబరాభరణంబుల గట్టనిచ్చి యనిపిన, నర్జునుం డవనీభువనంబునకు వచ్చెను. వచ్చినంతనే యగ్రజులకుం బ్రణమిల్లి, తమ్ములం

గాఁగిలించుకొని, ధౌమ్యాదులకు నమస్కరించి, ద్రౌపది నుప లాలించి, తక్కినవారలకు యథోచితంబు సేసి, తనవృత్తాంత మాద్యంతంబు నెఱింగించెను. ధర్మజుండును వీనుల విందొనరించు నావృత్తాంతంబును సాంతంబుగా విని ముద ముప్పొంగ ననుజు నాలింగనం బొనర్చి, భావిశుభసూచకం బిది యని కడుసంతసం బందెను. పార్థుండును క్రమంబున సమస్తరిపులను సమరమున జయించి, మాన్యుం డగు ధర్మాత్మజుచేఁ బ్రమదంబున విశ్వం బెల్లఁ బాలింపించెను.

ఇతి శివం

## ఇందుశేఖరవిలాసము

సమాప్తము.

